# అమ్మ అమ్మే



రచయిత - టి. త్రిలోక అప్పారావు

ప్రచురణ - శ్రీ విశ్వజననీ పరిషత్, జిల్లెళ్ళమూడి

# అమ్మ అమ్మ



రచయిత

టి. త్రిలోక అప్పారావు

జిల్లెళ్ళమూడి - 522 113.

ప్రథమ ముద్రణ : 2 జూన్ , 2013

ద్వితీయ ముద్రణ : 30 జూన్ , 2013

కాపీలు : 1000

ప్రతులకు : శ్రీ విశ్వజననీ పరిషత్
జిల్లెళ్ళమూడి - 522 113.
బాపట్ల తాలుకా, గుంటూరుజిల్లా.
ఫోన్ : 08643 -227324, 227492

మరియు

శ్రీ టి.టి. అప్పారావు
శ్రీవిద్యానిలయం, ఫ్లాట్‌నెం. 1,
జిల్లెళ్ళమూడి - 522 113.
బాపట్ల తాలుకా, గుంటూరుజిల్లా.
ఫోన్ : 08643-211505

డి.టి.పి. : క్రియేషన్ గ్రాఫిక్స్
7/3 అరండల్‌పేట, గుంటూరు-2.
ఫోన్ : 0863-2250885

ముద్రణ : శ్రీ లక్ష్మి గణపతి ఆర్ట్ ప్రింటర్స్
2/4 బ్రాడీపేట, గుంటూరు-2.
ఫోన్ : 0863-2235036.

# అంకితము



మాతృశ్రీ అనసూయాదేవికి

జగత్పిత శ్రీ బ్రహ్మాండం నాగేశ్వరరావు గారికి

నాన్నగారి శత సంవత్సరోత్సవాలలో

ఈ గ్రంథం

సభక్తికంగా సమర్పణ

- టి. త్రిలోక అప్పారావు

## 1981 అక్టోబరులో శ్రీఅప్పారావుగారి కుమారుడు
## చి॥ కృష్ణబాబు ఉపనయన దృశ్యాలు



శ్రీఅప్పారావుగారి భార్య శ్రీమతి కుసుమాంబ, శ్రీకొండముది
రామకృష్ణ, శ్రీమల్లాప్రగడ శ్రీరంగారావుగారు కూడా ఉన్నారు.



శ్రీ అప్పారావుగారి కుటుంబంతో పాటు తమ్ముడు
శ్రీ త్రిలోకేశ్వరరావు, వంకదారు సంజీవరత్నం కూడా ఉన్నారు.

## 1981 అక్టోబరులో శ్రీఅప్పారావుగారి కుమారుడు చి॥ కృష్ణబాబు ఉపనయన దృశ్యాలు



చి॥ కృష్ణబాబుకు యజ్ఞోపవీతం వేస్తున్న అమ్మ



చి॥ కృష్ణబాబుకు మాతృభిక్షపెడుతున్న అమ్మ



1973లో అమ్మ ఏలూరు పర్యటన సందర్భంగా నాన్నగారితో అధ్యయన పరిషత్ ఏలూరు శాఖ

# విషయసూచిక



## మాతృత్వ ప్రభావం

బ్రహ్మాండం రవీంద్రరావు,
పాట్రన్,
శ్రీ విశ్వజననీ పరిషత్
జిల్లెళ్ళమూడి

శ్రీ అప్పారావు అన్నయ్య అమ్మను గురువుగా దైవంగా విశ్వసించారు. త్రికరణ శుద్ధితో అమ్మను సేవించారు. అమ్మకే అంకితం అయిన వారి జీవితంలో అనేక సంచలనాత్మకమైన సంఘటనలు, మధురానుభూతులు చోటు చేసుకున్నాయి. అమ్మ ప్రబోధించిన సూక్తులను ఆచరణలో పెట్టేందుకు నిరంతరం కృషి చేసే సాధకులు.

అన్నయ్య రచించిన "అమ్మ అమ్మే" అనే ఈ గ్రంధంలో అత్యంత అద్భుత సన్నివేశాలు, సంఘటనలు, తోటి సోదరీసోదరులనుంచి, వారి వారి అనుభవాలను, స్వానుభవములను జోడించి, అమ్మ భక్తులు వ్రాసిన యితర గ్రంథములు, మహోదధి అనే అమ్మ జీవితచరిత్రలోని సంఘటనలను ఒక మాలగా కూర్చి ఈ సంకలన గ్రంధాన్ని మనకు అందించారు.

అమ్మ నీడలో కుక్కపిల్లికి, పిల్లికుక్కకు పాలివ్వడం నేను చూచి ఆశ్చర్యపోయాను.

నా చిన్నతనంలో ఒక నల్లకుక్క ఉండేది. అది జిల్లెళ్లమూడి వచ్చేవారికి స్వాగతం పలుకుతూ 7వ మైలు రాయి వద్ద నుండి అమ్మ వద్దకు దారి చూపించేది - తిరిగి వెళ్లే వారికి 7వ మైలు రాయి వరకు దారి చూపిస్తూ ముందుగా నడుస్తూ వారికి వీడ్కోలు చెప్పేది. అప్పటి రోజులలో బస్సు కొరకు గంటల తరబడి రోడ్డు వద్ద నిరీక్షించవలసిందే - ఆ పరిస్థితులలో మాకు ఆహారం కొరకు ఒక కాగితం మీద వ్రాసి ఆ కాగితాన్ని దాని మెడకుకట్టి పంపించేవాళ్లం. అమ్మ దగ్గర నుండి మాకు ఆహారం అందేది.

ఈ గ్రంథంలో అమ్మ మానవాళికే గాక, పశుపక్ష్యాదులను, జంతువులను, క్రిమి కీటకాదులను, తన మాతృత్వ ప్రభావంతో చైతన్యవంతం చేసిన అనేక సంఘటనలను మనందరికి అందించటం నాకు చాలా సంతోషంగా ఉంది. అందులో నా మనస్సును ఆకట్టుకున్న కొన్ని సంఘటనలు -

"మనిషిని ఏడిపించేది మంచితనమే" అనే శీర్షికలో ఉదహరించిన సన్నివేశం. ఈనాటి సామాజిక వ్యవస్థలో ఇది సాధ్యమా అని ఆశ్చర్యచకితులను చేస్తుంది. అమ్మ ఈ సన్నివేశంలో సంబంధిత వ్యక్తుల మానసిక స్థితిగతులను గమనించి, ఆలకించి, ఆదరించింది. మానసిక ప్రక్షాళన చేసి పవిత్ర పరివర్తనులుగా తీర్చిదిద్దింది.

తన 70 వేల రూపాయిలు విలువగలిగిన వేరుశనగనూనె లారీ తస్కరింపబడినపుడు అన్నయ్య చూపిన ఔదార్యం ఆశ్చర్యకరం. అపకారికి ఉపకారం చెయ్యమని సామెత చెప్పటం, కాక ఆచరణలో సాధ్యం చేశారు. అమ్మ తన జీవితంలో ఆచరించిన క్షమాగుణాన్ని అనుసరించారు. అమ్మ అనుగ్రహానికి పాత్రులయ్యారు.

అప్పారావన్నయ్య వ్రాసిన మహోపదేశం అనే శీర్షికలో తన ధ్యేయం, గమ్యం ప్రస్తావించారు. వారు నిర్దేశించుకున్న లక్ష్యాలు ఎంత పవిత్రమైనవో అంతక్లిష్టమైనవి. అనుగ్రహ స్వరూపిణి అయిన అమ్మ అన్నయ్యకు లక్ష్యసిద్ధిని ప్రసాదించాలని అమ్మనే వేడుకుంటున్నాను.

"అమ్మ అమ్మే" అను ఈ గ్రంథం మాన్యులకు సామాన్యులకు అందరికి అందుబాటులో ఉండి బహుళ ప్రచారం పొందుతుందని నమ్ముతున్నాను.





# మాతృయుగం

వి. యస్. ఆర్. మూర్తి,
ఆధ్యాత్మికశాస్త్రవేత్త,
హైదరాబాద్

అవనీ సంచారానికి వచ్చే అవతారమూర్తులందరూ ఆరాధనీయులే. ఒక్కొక్క రూపం, ఒక్కొక్క తేజం. ఎవరికి వారే స్మరణీయులు.

దేవుడంటూ ప్రత్యేకంగా లేని కృతయుగం, యజ్ఞయాగాల ద్వారా రామచంద్రుణ్ణి రప్పించుకున్న త్రేతాయుగం, యుగధర్మాన్ని ఆచరణాత్మకం చేసే దిశలో శ్రీకృష్ణ ఆగమనాన్ని ఆహ్వానించిన ద్వాపరయుగం, దేవుడు లేడంటూ ప్రారంభమైన కలియుగం ..... యిదంతా కాలవిభజన.

కలియుగం మాతృయుగం. శ్రీ లలితాధీనం. ఈ నేపథ్యంలో స్త్రీరూపంతో, మాతృభావంతో, తల్లిదనంతో, శక్తిమంతంగా ఆవిష్కృతమైన యోగాకృతి – మాతృశ్రీ జిల్లెళ్ళమూడి అమ్మ !

ఆరు దశాబ్దాల కాలం అమ్మదనంతో మానవాళికి మహోపదేశం చేసి మానవత్వాన్ని సంపూర్ణంగా అనుభూతి మయం చేసి, మాధవానుగ్రహాన్ని ప్రేమధారలుగా ఆనందరసాప్లావితం చేసిన మహనీయ మానవి అమ్మ !

అమ్మను దేవతను చేసి ఎడంగా ఉంచే కంటే, దేవతా సమూహమంతా ఒక్కరూపు తాల్చితే, అమ్మకావటం ఎంత అద్భుతం ! ఎంత ఆనందం ! వయోభేదం లేకుండా అమ్మత్వాన్ని అనుభవించటం ఎంత అదృష్టం !

ఆ అదృష్టాన్ని సాలోక్యంగా, సామీప్యంగా, సాన్నిధ్యంగా అనుభవించిన వారెందరెందరో ! సంపూర్ణ శరణాగతి, నిశ్చలభక్తి, అమలిన ప్రేమ, హిమాలయ సమున్నతగౌరవం, అమ్మ పట్ల ఒక్కరీతి నిలుపుకున్న చరితార్థులు కొందరే ! అందులో శ్రీ టి.టి. అప్పారావు గారొకరు.

కాలం పెట్టిన రాపిళ్ళకు ఒరిసి, కడగా మెరిసి, ప్రతికూలపరిస్థితులెన్ని ఉరితాళ్ళై చుట్టుకున్నా, ఊపిరులు ఉక్కిరిబిక్కిరౌతున్నా, నిగ్రహంతో అచంచల విశ్వాసంతో జీవితాన్ని పండించుకోవటం సాధారణ విషయం కాదు. అమ్మతో ఎవరికీ లభించని సంభాషణ భాగ్యం పొందిన శ్రీమంతుడాయన !

ఆయన విన్నవి, కన్నవి, అనుభవించి అనుభూతి చెందినవి కలిపి, 'ముద్ద' చేసి, మెతుకు మెతుకులో అమ్మ కమ్మదనాన్ని నింపి, రాబోయే తరాలకు 'అమ్మ అమ్మే!' అనే గ్రంధాన్ని విందుగా అందించారు.

**సంఘటనల కదంబం, ఈ గ్రంధం.**
**వేటికవే ప్రత్యేకం. పరిమళ భరితం !**

సాధకుడికి అమ్మను మానవిగా పరిచయం చేసే విధానం అత్యంత సహజం. అమ్మను సరైన కోణంలో అర్థం చేసుకోవటానికి, సాధ్యమయే రీతిలో సాధన చేసుకోవటానికి, ఈ గ్రంథం ప్రేరణ నిస్తుంది.

శ్రీ అప్పారావు గారు ఈ గ్రంధరచనలో తాను నడచి వచ్చిన దారిని, గడచి వచ్చిన కాలాన్ని తడిమి చూసుకున్న వైనం, సాధనే !

**ఈ గ్రంథం అమ్మకు నివేదన !**
**ప్రపంచానికి ప్రసాదం !!**





## మనస్సులో మాట

ఎమ్. దినకర్,
అధ్యక్షులు
శ్రీ విశ్వజననీపరిషత్, జిల్లెళ్ళమూడి

శ్రీ అప్పారావు అన్నయ్య నాకు జిల్లెళ్ళమూడి సోదరునిగ చిరపరిచితుడు. దాదాపు మా ఇరువురిది నాలుగు దశాబ్దాల అనుబంధం.

అన్నయ్య భక్తి ప్రపత్తులు కలవాడు, సజ్జనుడు, సహృదయుడు. గతకొద్ది సంవత్సరాలుగా ఆ మనిషిలోని మనీషిని, వ్యక్తిలోని అంతర్యాన్నీ చూచే, వినే, గమనించే సదవకాశం నాకు కలిగింది.

"సంసార జీవితం ఆధ్యాత్మిక సాధనకు ప్రతి బంధకం కాదు" అనే అమ్మ వాక్యాన్ని విశ్వసించిన సాధకుడు, అన్వేషి, జిజ్ఞాసువు. అనేకమంది గురువులను, దివ్యపురుషులను దర్శించాడు, సేవించాడు. వారి వారి బోధలను విన్నాడు, గ్రంధాలను పఠించాడు. ఉపదేశాన్ని మననం చేశాడు. అమ్మ సన్నిధిలో స్థిరపడ్డాడు. అమ్మ యందు విశ్వాసం కుదిరింది. అమ్మ దగ్గరే సాధన పరిణతి చెందింది.

అమ్మను సేవించాడు, స్తుతించాడు, ఆరాధించాడు. అనేక విధాల అమ్మని, అమ్మ యొక్క దివ్యమాతృత్వాన్ని అవగాహన చేసుకున్నాడు. దర్శించాడు. అమ్మ సామీప్యం, సాన్నిధ్యం, సాయుజ్యాలను పొందాడు తత్త్వతః.

ఈ గ్రంథంలో సమీకరించినట్లే అమ్మను అమ్మగానే చూశాడు. సోదరుని సాధన ఫలించింది. అమ్మ తత్త్వజలధిలోతుల్లో మునిగాడు. తన తత్త్వశోధనలో అమ్మతనం తియ్యనిది అని తెలుసుకుని అదే మనకు వివరించాడు, విశదీకరించాడు; సామాన్యునికీ అందుబాటులో ఉండేట్లు అలతి అలతి పదాలతో తేటతెల్లం చేశాడు.

నిజానికి సృష్టిలో చరాచరజగత్తులో అమ్మకన్న మిన్న ఎవరినీ ఎన్నలేము. అమ్మే తియ్యన. అమ్మ వద్ద శిశుభావనే మధురం. ఈ గ్రంథంలోని సంఘటనలు అదే సత్యాన్ని వెల్లడిస్తాయి.

సోదరుడు అప్పారావు మృదు మస్తిష్కం లోంచి జాలు వారి అక్షరరూపంలో అమ్మ మాతృత్వం వెలువడింది. అదే అమ్మతనం పాఠకులను అలరిస్తుంది, ప్రభావితులను చేస్తుంది. అట్టివారిలో కొద్ది మంది నిశ్చయంగా నిస్సందేహంగా అమ్మ దరిచేరి అమ్మ మాతృత్వపు దివ్యానుభూతులు ఆశీస్సులు పొందుతారని ప్రగాఢంగా విశ్వసిస్తున్నాను. ఈ పుస్తకం గురించి ఈ నాలుగు మాటలు చెప్పే అవకాశం కలిగినందుకు కృతజ్ఞుడను, ధన్యుడను.







# అమ్మ తీర్చిదిద్దిన మహాయోగి

## మా అన్నయ్య

బొప్పూడి రామబ్రహ్మము
Retd. G.M.Andhra Bank,
Ex-President,
Sree Viswajananee Parishat

అప్పారావు అన్నయ్యకూ నాకూ 39 సంవత్సరాల పరిచయం ఉన్నది. ఆయన నా ఆత్మీయ సోదరుడు, ఉపగురువు. అమ్మను గురించి అవగాహనను పెంచి, పెద్దచేసి అమ్మ సంస్థలతో నేను మమేకం కావటానికి దోహదం చేసిన మహనీయుడు.

ఈ అన్నయ్య ఎందరో మహాత్ములను సేవించి, ముఖ్యంగా అమ్మతత్త్వాన్ని అధ్యయనం చేసి ఆచరణలో పెట్టిన ఆదర్శప్రాయుడు. శ్రీశ్రీశ్రీ అవధూతేంద్రసరస్వతీస్వామి, శ్రీశ్రీశ్రీ లక్షణ యతీంద్రులవారు, శ్రీశ్రీశ్రీ మహాపూర్ణ యతీంద్రుల వారు, శ్రీశ్రీశ్రీ మాతా శారదా ప్రియానంద, శ్రీశ్రీశ్రీ మాతాప్రతిభా నందగిరి, శ్రీశ్రీశ్రీవాసుదేవానందగిరి వంటి మహాపురుష సంశ్రయాన్ని పొందిన ముముక్షువు. శ్రీ వేదాద్రి మహర్షి వద్ద కుండలినీ విద్యను అభ్యసించారు.

వారు ఏలూరులో 30 సంవత్సరాలు దీక్షగా సత్సంగాన్ని నిర్వహించారు. భాగవత, రామాయణ, భగవద్గీత, ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాదులలో గట్టిపట్టు చిక్కించుకున్నారు. అసంఖ్యాకులచే మండల దీక్షగా శ్రీ లలితాసహస్ర నామ పారాయణ చేయించారు. స్వరూపలలిత, స్వభావ మధుర అయిన లలితా పరమేశ్వరీ తత్త్వాన్ని వేనోళ్ళ చాటి; అమ్మనే ఆ లలితాదేవిగా దర్శించారు.

అమ్మ మధుర మాతృతత్త్వానికి పరవశించి, జీవితంలో అడుగడుగునా ఆచరిస్తున్న జ్ఞానయోగి, కర్మయోగి. కనుకనే వానప్రస్థాశ్రమ జీవితాన్ని గడిపేందుకు జిల్లెళ్ళమూడిలో స్థిరనివాసం ఏర్పరచుకున్నారు. ఇన్నాళ్ళు, ఇన్నేళ్ళూ తమ

ఆత్మబంధువుగా, సద్గురువుగా మార్గదర్శనం చేయించిన అప్పారావు అన్నయ్య తమకు దూరమౌతున్నారని తెలిసినపుడు ఏలూరు సోదరసోదరీమణులు కళ్ళ నీళ్ళ పర్యంతం అయ్యారు.

అపురూపమైన వారి సాహచర్యాన్ని, సత్సంగాన్ని విడువలేక కొందరు జిల్లెళ్ళమూడిలో వారితో శ్రీ విద్యానిలయంలో స్వగృహాలను ఏర్పరచుకున్నారు.

అప్పారావు అన్నయ్య పదిమంది సుఖసంతోషాల కోసం పరితపించే వ్యక్తి. జిల్లెళ్ళమూడిలో సత్సంగాన్ని ఏర్పాటు చేశారు; శ్రద్ధాసక్తులతో అమ్మ యందలి భక్తి ప్రపత్తులతో సత్సంగాన్ని నిర్వహిస్తూ అవతారమూర్తి అమ్మ తత్త్వాన్ని, సందేశాన్ని, ఆచరణాత్మకప్రబోధాన్ని అందరికీ వినిపిస్తున్నారు.

ఈ గ్రంధము రాశిలో చిన్నదైనా ఆబాలగోపాలము దీనిని చదివి అమ్మ వాత్సల్యామృతాన్ని గ్రోలి, అమ్మ దివ్యమాతృప్రేమను పొందుతారు.

ఈ గ్రంధాన్ని చదివిన వారు అప్పారావు అన్నయ్యవలె ఆదర్శవంతమైన జీవనశైలిని అలవరచుకుంటారు. అమ్మ అప్పారావు అన్నయ్యను తీర్చిదిద్దిన విధానంలో కొన్ని అమ్మ మాటలు - ఉపదేశ వాక్యాల్ని ఉదహరిస్తాను.

1. "నీ చేతిలో ఏమున్నది ? జరిగేది జరుగుతుంది. చూస్తూ ఉండు" అనే అమ్మ వాక్యం ఒక తెరచాప, చుక్కానిలా వారి జీవన నావని నడిపించింది; అంతేకాదు; యోగాభ్యాసంలో ఉన్నత భూమికలను అధిరోహించి, సాక్షీమాత్రంగా ఉండే స్థితిని పొందటానికి రాచబాటను వేసింది.

2. అనురాగమూర్తి అమ్మ ఒకనాడు స్వయంగా అప్పారావు అన్నయ్యకి ఎంతో ఆప్యాయంగా అన్నం తినిపిస్తోంది. 'అమ్మా ! ఎంతో హాయిగా ఉన్నదమ్మా" అన్నారు అన్నయ్య సజలనయనాలతో. "తినే వారికే ఇంత హాయిగా ఉంటే పెట్టేవారికి ఎంత హాయిగా ఉంటుందో, నాన్నా!" అన్నది అమ్మ. పదిమందికి పెట్టుకోవటంలోని తృప్తి, ఔన్నత్యము, పరమార్థములను ఈ సన్నివేశం ద్వారా విశదపరిచింది అమ్మ. ఇది మానవజీవితాలకి దిశానిర్దేశం చేసే మహత్తర సందేశం కదా!

ఇంకా ఇటువంటి ఉత్తమ గ్రంధాల్ని అప్పారావు అన్నయ్య రచించి మనకి అందించాలనీ, అందుకు అనిర్వచనీయమైన అమ్మ ఆశీస్సులు వారిపై వర్షించాలని ఆకాంక్షిస్తున్నాను.





# ఆకాంక్ష

బ్రహ్మాండం వసుంధర,
జిల్లెళ్ళమూడి

అమ్మను మించిన వేరే దైవం లేదనే కదా ఆర్యోక్తి. అలాంటిది జిల్లెళ్ళమూడి అమ్మను కన్నతల్లిగానూ తమ ఇష్ట దైవం గానూ భావించి ఆరాధించేవారూ ఉన్నారు.

అమ్మబిడ్డలలో కొందరికి అమ్మ అంటే అమ్మే అని, ఏ దైవంతోను పోల్చటానికి సరిపోదనేవారూ ఉన్నారు.

అమ్మ చింతనలో చివురిస్తూ, అమ్మ సేవలో పులకిస్తున్న అప్పారావు అన్నయ్యకు 'అమ్మ అంటే అమ్మ' అని మాతృవాత్సల్యాన్ని, అమ్మ ప్రేమను అందరికీ అందించమని అమ్మ ప్రేరణ నిచ్చింది. అమ్మ ప్రేమను, అమ్మ వాత్సల్యాన్ని అందరూ పొందాలనే ఆకాంక్షతో, అందరికి తెలియాలన్న ఆరాటంతో, తపనతో తన ఆరోగ్యాన్ని లెక్క చేయక ఒక తపస్వియై పలువురిపై పలురకాలుగా అమ్మ చూపిన మాతృత్వాన్ని, ప్రేమను ఆబాలగోపాలం పఠించగల సులభ శైలితో అక్షరరూపంలో మనకందించారు. అప్పారావు అన్నయ్యకు, వారి కుటుంబానికి అమ్మ అమృతాశీస్సులు సదా ప్రసరించాలనీ, మంచిని మించిన మహిమ లేదనే మహా మహిమాన్వితమైన అమ్మ మధురగాధలను మరెన్నో వారిచేత వ్రాయించాలనీ అమ్మను అర్థిస్తూ....





# అమ్మ చాటు బిడ్డ

పురుషోత్తమపుత్రభార్గవ
పి. యస్. ఆర్. ఆంజనేయప్రసాద్

శ్రీ తూనుగుంట్ల త్రిలోక అప్పారావుగారు వయసురీత్యా, జ్ఞానరీత్యా నా కన్న పెద్దవారు. వారు జిల్లెళ్ళమూడి అమ్మవద్దకు గత అరశతాబ్ది పైచిల్కు కాలం నుండి వస్తున్నవారు. పూర్వం "అమ్మ అందించిన ఆత్మానుభూతి"ని అనుభవించి అక్షరబద్ధం చేసినవారు. వారు కుండలినీయోగి. తన దేహాన్ని తాను సాక్షీభూతంగా చూసుకోగల శక్తిని సంపాదించుకున్నవారు. 'శ్వాసమీద నిఘా'తో మొదలై మనస్సును అదుపు చేసికొని 'ఆత్మ సంయమయోగం' సాధించిన చక్కని సాధకుడు.

జిల్లెళ్ళమూడి అమ్మను దర్శించిన వారందరికీ అది రెండవజన్మే. జిల్లెళ్ళమూడి వచ్చి వీళ్ళేం పొందుతున్నారమ్మా ! అని అమ్మను ప్రశ్నిస్తే "రావటమే పొందటం – వచ్చిం తర్వాత వృధాపోదు" అని అమ్మ చెప్పింది. రమణమహర్షి జీవితచరిత్ర మొదటిసారిగా వ్రాసిన కృష్ణభిక్షుగారు నన్ను కాపాడమ్మా! అంటే "అన్నిసార్లు పట్టిన ఆ పాదాలు నిన్ను కాపాడకుండా ఉంటాయా" అన్నది. ఎన్ని వందలసార్లు వేలసార్లు ఇన్ని సంవత్సరాలలో వచ్చి ఉంటారో శ్రీ అప్పారావన్నయ్యగారు. అమ్మ ఎవరికి ఏది కావాలో అది ఇవ్వగలిగింది గదా! వారికి కావాల్సింది వారికిచ్చింది.

"జిల్లెళ్ళమూడిలో ఎవరైనా ఉండవచ్చు. ఎవరికి తగ్గపని వారికుంటుంది. అయితే ఇతరులను విమర్శించకుండా ఉండగలగటం చాలా కష్టం నాన్నా!" అని జిల్లెళ్ళమూడిలో ఉంటానన్న ఒకసోదరునితో చెప్పింది అమ్మ. ఈనాడు అప్పారావన్నయ్య జిల్లెళ్ళమూడిలో ఉండగలుగుతున్నాడు. అమ్మ అనుగ్రహం. అంత కన్న కావల్సిందేముంది?

ఆత్మానుభూతిని పొందిన అప్పారావు అన్నయ్య ఇప్పుడు 'అమ్మ అమ్మే' అన్న గ్రంథం వ్రాశారు. తన గ్రంథానికి ఆ శీర్షికను అందించిన సోదరులు శ్రీ వల్లూరు శ్రీరామచంద్రమూర్తిగారు. ఆయన ఆధ్యాత్మిక శాస్త్రవేత్తగా లోకంచే కీర్తింప

బడుతున్నవారు. వారు ఋషి పంచమినాడు శ్రీకారం చుట్టారీ గ్రంధానికి. జిల్లెళ్ళమూడిలో ఋషియైన అప్పారావుగారు సాగించారీ రచనను. సాధించారీ రసమయ రమణీయక గ్రంధాన్ని.

'అమ్మ అమ్మే' బాగున్నదీ శీర్షిక. అమ్మ అమ్మ కాక ఎవరు? అమ్మ అమ్మేనని రూఢి చేయవలసిన, బల్ల గుద్ది చెప్పవలసిన అవసరమున్నదా? ఎంత అవసరమున్నదో సోదాహరణంగా చెప్పాలనేది ఈ రచయిత ఉద్దేశం. ఎందుకంటే ఎవరో ఒక సోదరుడు నీవు రాజరాజేశ్వరివి కదమ్మా! అంటే అమ్మ "నేను అమ్మను అనుకుంటే చాలదా! నాన్నా! " అన్నది.

అలా అని అమ్మ దర్శనాలివ్వలేదా అంటే ఎంతోమందికి ఎన్నో రూపాలలో వారి వారి ఇష్టదేవతా రూపాలలో దర్శనమిచ్చినట్లు అమ్మ జీవితచరిత్ర చదివితే మనకు తెలుస్తూనే ఉన్నది. బంగారం ఎన్ని రకాల నగలు చేసినా ఆ ఆకారాలు ధరించినట్లే అమ్మ కూడా వాళ్ళను తృప్తి పరచటానికి ఆయా రూపాలలో దర్శనాలు ప్రసాదించింది అనేది సత్యమైన విషయమే – అప్పారావు గారికి కూడా ఆ అనుభవాలు లేకపోలేదు.

ఏమైనా అప్పారావు గారు ఈ గ్రంథంలో అమ్మను అమ్మగానే నిరూపించదలచారు. మాధవి మానవిగా వచ్చినా రామునివలె అమ్మ కూడా మానవిగానే సంచరించింది. ఆ అమ్మను తెలియచేయటానికే ఈ అమ్మ రాక ఈ అవతారం అని స్పష్టంగానే చెప్పింది. రామావతారంలో కూడా మానవాతీతమైన శక్తులు చూపిన సన్నివేశాలు లేకపోలేదు. కాని రాముడు మాత్రం "ఆత్మానం మానుషం మన్యే రామం ధశరధాత్మజం" అనే చెప్పాడు. అలాగే సంచరించాడు. మానవాతీతమైన వాటిని దేనినీ ఒప్పుకోలేదు. అలాగే అమ్మ కూడా నీకు జరగాల్సిన కాలం వచ్చింది జరిగింది. ఇందులో నేం చేసింది ఏమీ లేదు అని చెప్పేది. అప్పారావు గారు 'ఎవరీ అమ్మ' అనే విచికిత్స చేసి నాలుగు గోడల మధ్య మంచం మీద కూర్చున్న అమ్మకాదు, ఆది అంతమూలేని సర్వానికీ ఆది అంతము అయినది అని తేల్చారు.

అమ్మను ఆకలిబాధ పోగొట్టే అన్నపూర్ణగా, ఆవేదనను తీర్చి అక్కున చేర్చుకునే తల్లిగా, సహజసహనమూర్తిగా, ఆపదలలో కాపాడే ఆపన్నహస్తంగా, కనువిప్పు

కలిగించే జీవనజ్యోతిగా, యోగీశ్వరిగా, రక్షాకవచంగా, ప్రాణప్రదాత్రిగా, బిడ్డలను గుండెలకు హత్తుకునే అమృతమూర్తిగా ఆదరణగా ఆప్యాయంగా అనుకోకుండా వారి వారి ఇళ్ళకు వెళ్ళి వారి హృదయాలకు తృప్తిని కలిగించే ఇలవేల్పుగా, అందరి తల్లులకు, తనను కన్న తల్లిని కూడా తల్లిగా, పశువులకు, పక్షులకు, దోమలకు చీమలకే కాదు చంపటానికి వచ్చిన నక్సలైట్లకూ ఆఖరికి భర్తకు కూడా తల్లిగా లాలించి పాలించిన అమ్మ అమ్మే మరి. విచక్షణ లేని వీక్షణతో తన శరీరం మీద గడ్డను కూడా బిడ్డగా చూడగల మాతృత్వపు ముద్ద అమ్మ. విశ్వం మొత్తం తానే, తన బిడ్డలే అని భావించిన అమ్మ అమ్మే. ఇంకొక పదం చాలదు లేదు వర్ణించటానికి.

ఇలా అమ్మలోని బహుముఖీనమైన మాతృత్వాన్ని వివిధ రీతులలో ప్రకటితమైన వానిని గుది గుచ్చి మాలచేసి అమ్మ నాన్నల కంఠసీమలలో అలంకరించి అమ్మ అమ్మే అని నిరూపించటానికి ప్రయత్నం చేశారు ఈ గ్రంథంలో శ్రీ అప్పారావు గారు.

ఈ ప్రయత్నంలో కృతకృత్యులైనందుకు అభినందిస్తూ అమ్మ చాటు బిడ్డగా ఇటువంటి పుస్తకాలు ఇంకా సృష్టించగల శక్తిని ఆయురారోగ్యాలను అమ్మ వారికి ప్రసాదించాలని ప్రార్థిస్తున్నాను.




అమ్మతో పి.యస్.ఆర్., వారి శ్రీమతి గిరిబాల



# సుదర్శనం - విశ్వరూప సందర్శనం

ఎ.వి.ఆర్. సుబ్రహ్మణ్యం,
జిల్లెళ్ళమూడి

గ్రంధ రచయిత శ్రీ అప్పారావు అన్నయ్య తన ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో మనో మందిరంలో అణువణువునా అమ్మను ప్రతిష్ఠించుకున్నారు. అమ్మ ఉనికి, చేతలు, మాటలు వేదసారాలు అని అనుభవ పూర్వకంగా నమ్మి వాటిని ఆచరణలో పెట్టటానికి అనుక్షణం తపించిన ఆదర్శ సాధకులు.

'అమ్మ అమ్మే' అనే ఈ గ్రంధం విశ్వరూప సందర్శనాన్ని ప్రసాదించే సుదర్శన చక్రం. అది విస్పష్టం చేసే అంశాలు :

- అనంతమైన శక్తి పరిమితరూపంగా తరింపజేసే తల్లిగా దిగి వచ్చింది.
- అమ్మను అమ్మగానే ఆరాధించటం హాయి, సులభం.
- అమ్మ లక్ష్యం - తల్లి ధర్మం. అంటే లాలన, పాలన, పోషణ, రక్షణ, శిక్షణ. ఒక్క మాటలో చెప్పాలంటే సముద్ధరణ.
- మనుష్యులు, జంతువులు, పశుపక్ష్యాదులు, క్రిమికీటకాలు, యోగులు, దేవతామూర్తులూ ... అంతా అమ్మ కన్నబిడ్డలే.
- అమ్మది సహజప్రేమ, సహజ సహనం.
- అమ్మ - నవజీవనదాయిని, ఆనందదాయిని, కైవల్యదాయిని, దైవత్వ దాయిని.
- ఆచరణాత్మక అమ్మ మహాప్రబోధం.

ఈ గ్రంథంలోని అంశాలు -వాటి అర్థాలూ, పరమార్థాలూ అవ్యక్త మధురమైనవి.

ఈ గ్రంథం ఒక కార్తీకదీపంలా శాంతి, కాంతి పుంజాల్ని నిరంతరం ప్రసరింప చేస్తాయి.

భక్తి, జ్ఞాన, వైరాగ్య మార్గాలలో అమ్మను ఆరాధించేందుకు అన్నయ్య మరిన్ని గ్రంధాలను మున్ముందు వెలువరిస్తారని, అందుకు ప్రేమామృతపయోరాశి అమ్మ దయ అన్నయ్యపై నిరంతరం వర్షించాలని అమ్మ శ్రీ చరణాలను ప్రార్థిస్తున్నాను.





# గుర్తు చెప్పిన వాడే గురువు

చక్కా శ్రీమన్నారాయణ,
జిల్లెళ్ళమూడి

జన్మనిచ్చింది కన్నతల్లిదండ్రులైనా, జన్మసార్థకతకు నాకు మార్గదర్శనం చేసింది నా మామగారు శ్రీ టి.టి.అప్పారావుగారు.

జిల్లెళ్ళమూడి గడ్డ మీద అడుగుపెట్టి, వాత్సల్యరసవాహిని అమ్మ హృదయాంతరాళాల్లో సుస్థిరస్థానాన్ని పొందే మహద్భాగ్యాన్ని కలిగించింది నా మామగారే. వారు తండ్రిగా, గురువుగా తమ అనుభవపూర్వక సత్యాలను వివరించి తరచు నా సందేహాలను నివృత్తి చేసి జీవిత ధ్యేయాన్ని జీవన మార్గాన్ని తెలియచేశారు.

'దుర్లభం త్రయమే వైతత్ మోక్షానుగ్రహకారకం ।

మనుష్యత్వం ముముక్షుత్వం మహాపురుష సంశ్రయః ॥" అనే ఆర్షవాణికి వారిజీవితం సాకార రూపం.

అమ్మను గురువుగా దైవంగా నిర్ధారించుకొని ఆ తల్లి శరణాగతిని పొందారు. అనేకకోణాల, అనేక రీతుల అమ్మ విరాడ్రూపాన్ని దర్శించారు. అమ్మ మహత్త్వాన్నీ దివ్య మాతృప్రేమనీ వేనోళ్ళ చాటారు.

ఇక గ్రంథం గురించి రెండు మాటలు.

ఈ గ్రంథంలో అణువణువునా అమ్మ ప్రేమతత్త్వమే ప్రకాశిస్తోంది; భాషాశైలి సామాన్యునికి అందుబాటులో ఉంది. విషయ ప్రస్తావనారీతి అమ్మ చేతి గోరుముద్దలా కమ్మగా, కమనీయంగా మహిమాన్వితంగా ఉన్నది.

ఈ గ్రంథం మృదుమధుర లలితపదాలతో విరాజిల్లుతోంది. కావున ఏ మాత్రం భాషాజ్ఞానం కలవారికైనా సులభంగా అర్థమౌతుంది. అది అలౌకికమైన దివ్యమాతృ ప్రేమామృతాన్ని తరతమభేదం లేకుండా అందరికీ పంచుతుంది.

'అమ్మ అమ్మే' అనే ఈ గ్రంథం అమ్మ యొక్క విశ్వజనీన మమకారాన్నీ, అపారమైన అనుగ్రహాన్నీ, అకారణకారుణ్యాన్నీ, అమ్మ సహజ మాతృప్రేమను కలబోసి అమ్మ ప్రేమతత్వానికి దర్పణం పడుతుంది.





# ప్రేమార్చన

బి. యల్. సుగుణ

అమ్మ దగ్గర మారాం చేసి అమ్మ చేతి గోరుముద్దలు తిన్న అదృష్టవంతులు, ప్రతి పుట్టినరోజుకు నా దగ్గరకు రా నాన్నా! అని అమ్మ చేతనే పిలిపించుకున్న భాగ్యశాలి, అమ్మకు గారాబు బిడ్డ ఈ గ్రంథరచయిత శ్రీ అప్పారావు అన్నయ్యగారు.

అమ్మను ఆశ్రయించడం అంటే అమ్మ గుణాలను అలవరచుకోవడమే అనీ, అమ్మను అర్చించడం అంటే అమ్మ ఆదర్శాలను ఆచరణలో పెట్టడమే అని త్రికరణ శుద్ధిగా నమ్మి అదే సాధనగా జీవితాన్ని సార్థకం చేసుకుంటున్న ధన్యజీవనులు. 'మాతృతత్వానికి స్త్రీ పురుష భేదం లేదు' అని అమ్మ చెప్పినట్లుగా అమ్మ తత్వాన్ని పుణికి పుచ్చుకున్న ఆర్ద్ర హృదయులు. కొన్ని సన్నివేశాలలో శ్రీ అప్పారావుగారు స్పందించిన తీరు చూసి అమ్మ అడిగిందట. నీవు తల్లివా ! తండ్రివా ! అని. ఈ ఆర్ద్రతను గమనించే ఏమో శ్రీ వి. యస్. ఆర్. మూర్తిగారు అమ్మను మాతృత్వపు కోణం నుంచి దర్శించి ఈ గ్రంథం వ్రాయమని శ్రీ అప్పారావు గారిని ఆదేశించారని అనిపిస్తుంది.

అమ్మను దర్శించిన అందరికీ ఒకే అభిప్రాయం కలుగలేదు. కొందరు అమ్మను అవతారమూర్తిగా, మరికొందరు తత్త్వవేత్తగా, ఇంకొందరు సద్గురువుగా, ఆదర్శగృహిణిగా, ప్రేమస్వరూపిణిగా అనేకులు అనేక విధాలుగా దర్శించారు. ఎవరు ఎలా దర్శించినా, భావించినా అమ్మ మాత్రం "నేను అమ్మను, మీరు బిడ్డలు" అనే చెప్పింది. ఒకసారి ఒక సోదరులు అమ్మా ! మీరు సాక్షాత్తూ రాజరాజేశ్వరి కదా! అంటే 'ఇన్ని పేర్లు ఎందుకు నాన్నా! అమ్మను అనుకుంటే చాలదూ' అన్నది అమ్మ. 'నేను ఏ ధర్మం కోసం రాలేదు. తల్లి ధర్మం కోసం వచ్చాననుకుంటున్నాను. ఈ రూపం అలాంటిది. ఈ స్థానం అలాంటిది. కనుక నాకు ఎవరిని చూసినా బిడ్డే అనిపిస్తుంది. అంతేకాదు. ఎవరో కన్నారు. ఎక్కడో పుట్టారు. ఇక్కడికి వచ్చారు

అనిపించదు. నేనే కని మీమీ తల్లులకు పెంపుడు ఇచ్చాననిపిస్తుంది” అని చెప్పింది. మనుష్యులే కాదు. దోమలు, ఈగలు, పాములు, పశువులు, పక్షులు, రోగాలు, బాధలను కూడా బిడ్డలుగా ప్రేమించడం అమ్మ జీవితంలో అడుగడుగునా కనిపిస్తుంది.

అమ్మ అందరినీ తన బిడ్డలుగా ప్రేమించడం లోని ఆంతర్యం ‘మనమందరం ఒక తల్లిబిడ్డలమే’ అన్న సత్యాన్ని మనకు ఎరుకపరచడమే. అమ్మ ఆలోచనను అవగాహన చేసికొనిన వారెవరయినా, ఎలాంటి వారయినా తోటివారిని తోడబుట్టిన వారిగా ప్రేమించగలిగితే అమ్మకు నిజమైన వారసులమవుతాం. ‘మంచివాళ్లను వాళ్ల మంచితనమే కాపాడుతుంది. చెడ్డవాళ్లను నేను కూడా దగ్గరకు తీయకపోతే ఎలా’ అంటూ కులమతాలే కాదు గుణాలకు అతీతంగా దుర్మార్గుల్ని సయితం బిడ్డలుగా తన ఒడిలో చేర్చి లాలించింది అమ్మ. ‘శిక్ష అంటే మనిషిని సంహరించడం కాదుగా గుణాన్ని మార్చడమే’నంటూ బిడ్డల తప్పు గ్రహించినా శిక్షించకుండా ప్రేమతో వారి కున్న మనోవైకల్యాన్ని సరిచేసి అద్భుత పరిణామం తీసుకు వచ్చింది అమ్మ.

అమ్మను పరిపూర్ణంగా విశ్వసించి అనుక్షణం అమ్మనే స్మరిస్తూ ఆరాధిస్తూ ఉన్న శ్రీ అప్పారావుగారు ఆచరణాత్మకమైన అమ్మ ప్రబోధాన్ని అందుకుని తనకపకారం చేసిన వ్యక్తిని క్షమించి ప్రేమతో అతనిలో పరివర్తన తీసుకు వచ్చి అమ్మ సిద్ధాంతాన్ని ఆచరణలో చూపి ఎందరికో మార్గదర్శకులయ్యారు.

తనను ఎంతో మోసం చేసిన లారీ డ్రైవరును తన తమ్మునిగా భావించి అతనికి కోర్టు విధించిన అపరాధ రుసుముకూడా తానే చెల్లించి

‘అపకారికి ఉపకారము

నెపమెన్నక’ చేసిన నేర్పరి అయ్యారు.

అమ్మతత్త్వాన్ని అణువణువునా జీర్ణించుకున్నవారు గనుకనే అమ్మ తత్త్వాన్ని ఆవిష్కరించే ఈ గ్రంధరచనకు అమ్మ అన్నయ్యగారిని ఎన్నుకున్నదేమో అనిపిస్తుంది.

ఏ విచక్షణా లేకుండా ఎల్లరకూ తన ఎనలేని ప్రేమను పంచి పెట్టడ అమ్మ తత్త్వం. ప్రేమ, కరుణ, సహనం, త్యాగం, బాధ్యత, ఎక్కడ ఉంటే అ మాతృతత్త్వం. ఏం చేసినా మారనిదీ, చెదరనిదీ ఎక్కడుంటే అదే తల్లితత్త్వం

అమ్మలోని ఈ తత్త్వాన్ని ఆవిష్కరించే ఎన్నో సంఘటనలు ఇందులో ప్రస్తావించారు అన్నయ్యగారు. ప్రత్యక్ష ప్రమాణం కంటే మించిన దేదీ లేదంటారు. అమ్మ దివ్యానుగ్రహంతో స్వయంగా తాము ఎన్నో అనుభవాలను పొందడమే కాదు ఎన్నో సంఘటనలకు ప్రత్యక్షసాక్షి అన్నయ్యగారు. కనుకనే 'వింటే విమర్శ కాని కంటే లేదు. విన్నవాడు విమర్శిస్తాడు. కన్నవాడు వివరిస్తాడు' అని అమ్మ చెప్పినట్లుగా ఆ సంఘటనలను చక్కగా వివరించి తాము పొందిన అనుభూతిని మనకు అందించారు.

'నా జీవితమే సందేశం' అని చెప్పిన అమ్మ ప్రతి కదలిక సందేశమే. ప్రతి పలుకూ ప్రబోధమే. అమ్మలోని విశ్వమాతృత్వపు మధురిమలను అందరికీ పంచడమే ఈ గ్రంధరచనలోని ప్రధాన ఉద్దేశం. అమ్మ ప్రబోధించిన మాతృతత్త్వాన్ని అలవరచుకుని అందరినీ ప్రేమతో ఆదరించడమే అమ్మకు నిజమైన అర్చన. అలా అలవరచుకోవడానికి దారి చూపించే ఈ రచన అమ్మకు అసలైన ప్రేమార్చన.





# మా నాన్నగారు

మా నాన్నగారు వృత్తి రీత్యా వ్యాపారస్తులు. కాని వారి ప్రవృత్తి వేరుగా ఉండేది. నియమబద్ధమైన జీవితం గడుపుతూ స్థిత ప్రజ్ఞులుగా జీవించాలని, ఈ జన్మలోనే జీవన్ముక్తిని పొందాలనేది వారి ఆశయం. భగవత్ గీతను ఎక్కువగా అధ్యయనం చేసేవారు. అధ్యయనం చేసిన దానిని అచరణలో పెట్టటానికి చేసే ప్రయత్నంలో భాగంగా అనేకమంది మహాత్ములను కలిశారు. చివరకు అమ్మ దగ్గర జిజ్ఞాసువుగా చేరి శరణాగతుడై అమ్మగా, గురువుగా, దైవంగా ఆరాధించారు. అమ్మ జీవితాన్ని ఆదర్శంగా తీసుకుని చేతనయినంత వరకు ఆచరించటమే ఆరాధన అనేవారు. క్రమశిక్షణతో మమ్ములను పెంచారు. వారు కూడా నిజాయితీతో జీవితం గడపటానికి అనుక్షణం తపనపడుతూ ఉండేవారు. శేషజీవితం అమ్మ సన్నిధిలో గడపాలని బలమైన కోరికతో ఉండేవారు. అమ్మ కరుణించి 2009 నుండి మా అమ్మనాన్నలకు జిల్లెళ్ళమూడి లోనే స్థిరనివాసం ఏర్పరచింది.

మా నాన్నగారు తొలుత 'అమ్మ నోటి ఆణిముత్యాల'నే గ్రంధాన్ని తరువాత 'అమ్మ అందించిన ఆత్మానుభూతి' అనే గ్రంధాన్ని రచించారు. అమ్మ జీవిత చరిత్రలోని ప్రేమతత్వానికి దర్పణం పడుతూ వున్న కొన్ని ఘట్టాలను తీసుకొని అమ్మను అమ్మగా ఆరాధించటం సులభమని తెలియచేస్తూ 'అమ్మ - అమ్మే' అనే గ్రంధాన్ని రచన చేయమని ఆదేశించిన శ్రీ వి.యస్.ఆర్.మూర్తి గారి ఆదేశంతో, ఆశీస్సులతో అమ్మపై పరిపూర్ణ భక్తితో ఈ గ్రంధాన్ని పూర్తి చేశారు.

విషయం తెలియగానే ఈ గ్రంధ ముద్రణకు నాన్నగారి కోరిక ప్రకారం వారి మనమలు మునిమనమలు, మనమరాండ్లు, మునిమనుమరాలు సంతోషంతో ముందుకు వచ్చినందుకు, వారిని కూడా ఈ పుణ్యకార్యక్రమంలో మా నాన్నగారు భాగస్వాములు చేసినందుకు మేమందరం ఆనందపడుతున్నాం.

ఇట్లు,

**కుమారుడు: కృష్ణబాబు;**

**కుమార్తెలు : రాధ,వాణి,లక్ష్మి, వైదేహి**

# తొలిమాట



అమ్మ అనుగ్రహం వలన ఈ గ్రంథరచన చేయటం ఈ సాహిత్య కుసుమాన్ని అమ్మ,నాన్నగార్ల శ్రీ చరణాల చెంత సమర్పించటం నా అదృష్టం, పురాకృత పుణ్యఫలం. నాన్నగారి శతజయంతి ఉత్సవాల సందర్భంగా ఆది దంపతులైన అమ్మ నాన్నగార్లకు ఈ గ్రంథాన్ని కృతజ్ఞతతో సవినయంగా, సభక్తికంగా సమర్పిస్తున్నాను.

2012 సెప్టెంబరు నెలలో జిల్లెళ్ళమూడిలో శ్రీ వి. యస్. ఆర్. మూర్తిగారు ప్రసంగిస్తూ 'అమ్మను అమ్మగానే దర్శించండి, అమ్మగానే ఆరాధించండి, అది సాధకునికి సులభమైన మార్గం' అనే సందేశాన్ని ఇచ్చారు. అమ్మ ప్రేమతత్త్వానికి దర్పణం పడుతూ 'అమ్మ అమ్మే' అనే గ్రంథాన్ని రచించమని నన్ను ఆదేశించి 'ఈ రోజు ఋషి పంచమి' అంటూ ది. 21. 9. 2012 న గ్రంథరచనకు శ్రీకారం చుట్టి ఆశీర్వదించారు.

ఈ గ్రంథ రచనకు స్ఫూర్తిదాత ఆధ్యాత్మిక ప్రతిభాసంపన్నులు శ్రీ వి. యస్. ఆర్. మూర్తి గారికి హృదయపూర్వక నమస్సుమాంజలులు సమర్పిస్తున్నాను.

అవతారమూర్తి తత్త్వం అవాఙ్మానసగోచరమైనది. దానిని వర్ణించటం సామాన్యునికి అసంభవం, అసాధ్యం. అమ్మకి పండితుని కంటె పామరుడంటేనే ఎక్కువ ఇష్టం. అందుచేతనే నా కలం ముందుకు సాగింది.

నా యందలి ఆదరాభిమానములతో నన్ను ప్రోత్సహించి తమ సహాయ సహకారాల నందించిన కె. బి. జి. కృష్ణమూర్తి, మన్నవ దత్తాత్రేయశర్మ, వి. యస్. యన్. మూర్తి, డాక్టర్ ఎం. శ్రీవల్లి గార్లకు ఆత్మీయ కృతజ్ఞతా కుసుమాంజలి సమర్పిస్తున్నాను.

ముఖ్యంగా నా యందలి సోదరప్రేమతో ఈ గ్రంథాన్ని గురించి తమ అమూల్య సందేశాలను అందించిన ఆత్మబంధువులు, శ్రీ వి. యస్. ఆర్. మూర్తి, శ్రీ బ్రహ్మాండం రవీంద్రరావు, శ్రీ బి. రామబ్రహ్మం, శ్రీ పి. యస్. ఆర్. ఆంజనేయప్రసాద్, డాక్టర్ బి. యల్. సుగుణ, శ్రీ ఎం. దినకర్, శ్రీమతి బ్రహ్మాండం వసుంధర, శ్రీ ఎ. వి. ఆర్. సుబ్రహ్మణ్యం గార్లకు కృతజ్ఞతా కుసుమాంజలిని సమర్పిస్తున్నాను.

ఈ రచన గ్రంధరూపంలో ప్రచురించడానికి సంతోషంగా ముందుకు వచ్చిన చిరంజీవులు మా మనవలు, మనవరాళ్లు, మునిమనవరాలు, మునిమనవలకు; ఈ మొత్తం బాధ్యత స్వీకరించి సుందరరూపకల్పన చేసిన మా అల్లుడు చిరంజీవి చక్కా శ్రీమన్నారాయణకు, అహరహం అనుక్షణం సకల సౌకర్యాల్ని సమకూర్చి నాకు తోడ్పడిన నా సహధర్మచారిణి చి. ల. సౌ. కుసుమాంబకు – మాంగళ్యదేవత అమ్మశుభాశీస్సులు సర్వదా అనుగ్రహించమని కారుణ్యరసాధి దేవత అమ్మనే వేడుకుంటున్నాను.

ఈ గ్రంధరచనలో ఎక్కువగా స్వానుభవాల్ని, మనసోదరీ సోదరుల అనుభవాల్ని ఇతర గ్రంథాల్ని ఆధారంగా చేసుకున్నాను.

ఇట్లు

మీ తోడబుట్టిన

**టి.టి.అప్పారావు**

శ్రీ విద్యానిలయం, జిల్లెళ్ళమూడి

# 1. ఎవరీ అమ్మ ?

ఎవరీ అమ్మ అంటే – సృష్టికి మూలమైన దివ్య మాతృప్రేమ మూర్తీభవించి కరచరణాది అవయవములతో అమ్మగా జిల్లెళ్ళమూడిలో అవతరించింది.

అమ్మను 'అమ్మా' అని పిలవటంలో ఒక దివ్యానుభూతి కలుగుతుంది. వర్గ, లింగ, వయోభేదం లేకుండా పండిత, పామర తారతమ్యం పాటించకుండా అందరు 'అమ్మా' అని పిలిచి మురిసిపోతారు.

సామాన్యమానవులే కాదు సాధుపుంగవులు, సన్యాసులు సహితం 'అమ్మా' అనే పిలుపులోని కమ్మదనాన్ని అనుభవించారు – అమ్మ పలకరింపు లోని ప్రేమామృతాన్ని ఆస్వాదించారు. ఆ ప్రేమమూర్తిలాలనలో పరవశించారు.

ఎందరో మేధావులు, నాస్తికులు, ఆస్తికులు, శాస్త్రజ్ఞులు, రాజకీయవేత్తలు, విదేశీయాత్రికులు తమ తమ పదవులను మరచిపోయి అమ్మ చల్లని ఒడిలో పసిపాపలై సేదతీరినవారే. వారందరికి అమ్మలో దివ్య మాతృత్వమే గోచరించింది.

అమ్మను కన్న తల్లిదండ్రులుకాని, అమ్మను కోడలుగా చేసుకున్న అత్తమామలు కాని,అమ్మకు కోడళ్లయిన, శేషు, వైదేహి కాని అందరు అమ్మను 'అమ్మా" అని పిలిచినవారే.

ఈ సృష్టిలో సకల జీవరాసులు అమ్మ ప్రేమను పొంది ఆనందించిన ధన్యజీవులే. అమ్మలో ప్రకటితమయ్యే మాతృత్వం మానవులకే పరిమితం కాదు. మనం అసహ్యించుకునే పంది, మనం భయపడే పాము కూడా అమ్మకు ముద్దు బిడ్డలే. "నాకు పందిపిల్ల ముద్దు వస్తుంది, పాము పడగ ముద్దు వస్తుంది" అంటుంది అమ్మ.

అమ్మ సకల జీవకోటిని ప్రేమించడంలో ఆశ్చర్యం లేదు. అమ్మది సహజ ప్రేమ. అమ్మది అవ్యాజకరుణ. అమ్మ ప్రేమకు ఆనకట్టలు లేవు. అమ్మ దృష్టికి అడ్డుగోడలు లేవు.

ప్రేమరసవాహిని అయిన అమ్మ ప్రేమకు పండిత పామర, పేద ధనిక వంటి తారతమ్యాలు లేవు. అవధులు లేని అమ్మ ప్రేమకు స్వపర భేదాలు లేవు. కులమత వర్గలింగ భేదాలు లేవు.

పశుపక్ష్యాదులు సైతం అమ్మలోని దైవత్వాన్ని గుర్తించి అమ్మను విడిచి ఉండలేక అమ్మ సామీప్యాన్ని కోరుకోవటం అమ్మ ప్రేమకోసం ఆరాటపడటం తిరిగి తమ ప్రేమను ప్రకటించడం హద్దులు లేని అమ్మ ప్రేమకు నిదర్శనం.

"ఎంతమంది బిడ్డలున్నా తల్లికి ఏ బిడ్డకు ఆ బిడ్డే ఎక్కువ అనిపిస్తుంది. నాకేదైనా వస్తే నాకు బాధ ఉండదు. మీకు వస్తే నాకు బాధ ఉంటుంది చెట్టుకు కాయకు ఉండే సంబంధమే మీకు నాకు అనుబంధం".

"అమ్మ అంటే

జిల్లెళ్ళమూడిలో నాలుగు గోడల మధ్య మంచం మీద కూర్చున్న అమ్మ అనేకాదు.

దేనికైతే ఆది అంతము లేదో,

ఏది సర్వానికి ఆది అంతమో అదే అమ్మ.





## 2.అమ్మ అమ్మే

ఒకసారి తమిళనాడులోని జ్ఞానభూమి పత్రికా సంపాదకులు అమ్మతో "లోకంలో అందరిని తన బిడ్డలుగా చూచినవారు పూర్వం ఎక్కడా, ఏ పురాణాలలోను, ఏ అవతారాల్లోను, కనిపించలేదు. మీకు ఏ సాధన చెయ్యకుండా ఈ మాతృభావన ఎలా వచ్చింది?" అని అన్నారు. అందుకు అమ్మ "ఏమో నాన్నా! నాకేమీ తెలియదు. నేను ఏ శాస్త్రం చదివి, ఏ సాధన చేసి, ఆ భావం పొందలేదు. చిన్నప్పటి నుంచి సహజంగానే ఉన్నది. ఎవరిని చూచినా నా బిడ్డే అనిపిస్తుంది" అన్నది.

మూర్తీభవించిన మాతృప్రేమకు ప్రతిరూపమే అమ్మ. ప్రేమనే దివ్యాస్త్రంగా మలుచుకున్న అమ్మలో ప్రకటితమయ్యే మాతృత్వ మాధుర్యం మానవులకే పరిమితం కాదు. ప్రాణం లేదని మనం అనుకునే పదార్థాలు కూడా అవధులు లేని అమ్మ ప్రేమను పొంది ఆనందించిన ధన్యజీవులే. అందుకు కొన్ని ఉదాహరణలు.

– జిల్లెళ్ళమూడి అంతా వరదనీటిలో మునిగిపోతే "అమ్మాయి గంగ ఇంటికి వచ్చింది. పసుపు కుంకుమలు, చీరెసారె పెట్టి పంపించ"మన్నది.

– ఒకసారి అమ్మకు తాతగారైన చిదంబరరావు గారు అమ్మను దిన పత్రికను తీసుకు రమ్మంటే "పత్రిక కాదు పుత్రిక" అంటుంది అమ్మ.

– అమ్మ వాత్సల్యపర్యటనలో భాగంగా కృష్ణాజిల్లా నందిగామ గ్రామంలో ఒక సోదరుని ఇంటికి వెళ్లినప్పుడు ఆ ఇంటి ముందున్న కొబ్బరిచెట్టు నిండా బొండాలు ఉంటే ఆ చెట్టును చూచి అది కూడా తన బిడ్డేననిపించి "నిండు గర్భిణిగా ఉన్న చెట్టును చూచేది ఇలాగేనా?" అంటూ ఆ చెట్టు మొదలు అంతా శుభ్రంగా చేయించి నీళ్లు పోయించింది.

– అమ్మ భవన ప్రాంగణంలో నడయాడిన కోతి చనిపోతే దానికి యధావిధిగా అంత్యక్రియలు జరిపించి, దేవాలయాన్నే కట్టించింది.

– అమ్మనే బిడ్డగా కోరుకున్న ఒక వరాహం యొక్క స్తన్యపానం చేసి బిడ్డగా అనుభూతినిచ్చింది.

– మరణ బాధవలన లేవలేక శరీరంలో కలుగుతున్న తపనకు తట్టుకోలేక ఎక్కడో పడుకుని ఉన్న కుక్క దగ్గరకు బురదలో నడిచివెళ్ళి ఆ కుక్క ప్రక్కనే కూర్చొని ఆప్యాయంగా దాని వీపు నిమురుతూ, తులసిదళాలు వేసి పాలుపట్టించి మూతికడిగి తన పమిట చెంగుతో తుడిచింది.

– ఒకసారి అమ్మ బుగ్గమీద ఆకుపచ్చని పురుగు పాకుతుంటే ఆ పురుగును తీసే ప్రయత్నంలో ఉన్న సోదరుని చెయ్యి పట్టుకుని "ఉండరా నాన్నా! దాని ఆనందం ఏమిటో" అన్నది.

– సహజ విరోధులైన ఎలుకకూ పిల్లికి తన పమిట చెంగులో ఆశ్రయాన్ని కల్పించి ఆ రెండూ ఆడుకునేటట్లుగా చేసింది.

ఒకానొక సందర్భంలో "ఆ అమ్మ తెలియటానికే ఈ అమ్మ" అని అమ్మే చెప్పింది. విశ్వజనని అయిన ఆ అమ్మే ఈ అమ్మ అనటానికి ఇంతకంటే నిదర్శనాలు ఏం కావాలి?

ఈ అమ్మే ఆ అమ్మ;

ఆ అమ్మే ఈ అమ్మ.

'అమ్మ' అమ్మే.





# 3. "నేను అమ్మను"

అమ్మంటే ఏమిటో అమ్మ మాటలలోనే తెలుసుకుందాం.

28.4.1968న వెల్లటూరు దగ్గర తిప్పనగుంట అనే గ్రామం నుండి వచ్చిన ఒక సోదరునికి అమ్మకు జరిగిన సంభాషణ.

సో: మిమ్మల్ని అందరూ అమ్మ అంటున్నారు. మీరు ఎవరికి అమ్మ?

అమ్మ : నా పిల్లలకు.

సో : మీ పిల్లలు ఎవరు?

అమ్మ : అందరూ నా బిడ్డలే; వాళ్లు గుర్తించినా, గుర్తించకపోయినా. వాళ్ళందరిని పిల్లలుగానే గుర్తిస్తున్నాను. కనుక అమ్మనే.

సో : ఒక్క మానవులకేనా ? సమస్త ప్రాణికోటికీనా?

అమ్మ : నాకు పిల్లలు కానిది ఏమీ అనిపించడం లేదు - నాదృష్టిలో అంతా పిల్లలే.

సో : మీ తల్లికి కూడా మీరు అమ్మేనా?

అమ్మ: నేను అందరికి అమ్మనే కనుక ఆమెకూ అమ్మనే.

కాని (నా తల్లి) రంగమ్మ కడుపున పుట్టాను కనుక ఆమె నాకు అమ్మే.

ఆమె కూతురునే నేను. నాకు ఆమె కూతురే.

– "నేను తల్లిధర్మం కోసం వచ్చాననుకుంటున్నాను. తల్లి స్వభావం ఎట్లా ఉంటుందంటే – బిడ్డ బురదపూసుకొచ్చినా, ఇంకా ఏం పూసుకుని వచ్చినా, అసహ్యించుకోకుండా కడిగి దగ్గరకు తీసుకోవాల్సిన బాధ్యత ఉంది. దానికి మాతృత్వం కావలసి వచ్చింది. అందుకే అమ్మగావచ్చాను" అనీ

– 'మీరు రాజరాజేశ్వరి గదా!' అని ఒకరంటే, "ఇన్ని పేర్లెందుకు నాన్నా! అమ్మ అంటే చాలదా!" అని అన్నది.



# 4. అన్నపూర్ణాలయం

అమ్మను చూడటానికి వచ్చిన వారందరికి 1958వ సంవత్సరం ఆగష్టు 15వ తేదీ వరకు నాన్నగారింట్లోనే అమ్మ స్వయంగా వంట చేసి పెట్టేది. బాల్యం నుండి ఆకలితో ఉన్న మనుష్యులకే కాక, పశు పక్ష్యాదులకు సైతం కడుపు నింపి పరమానందపడేది. అమ్మ సన్నిధికి ఎవరొచ్చినా అమ్మ వేసే మొదటి ప్రశ్న అన్నం తిన్నావా నాన్నా? అని. ఏ వేళ ఎవరొచ్చినా బిడ్డలకు ఆదరంగా అన్నం పెట్టాలనేది అమ్మ ఆకాంక్ష. బిడ్డలకు అన్నం పెట్టుకోవటమే తన కర్తవ్యంగా భావించి ప్రపంచంలో ఏ ఒక్కరూ ఆకలితో ఉండరాదని, కడుపునిండా తినాలని, ఆ రోజు ఎప్పుడు వస్తుందా! అని నిరంతరం తపించింది. దాని ఫలితమే అందరింటిలో ప్రధాన భాగమైన అన్నపూర్ణాలయం. ఇది అమ్మ వాత్సల్యానికి ప్రతిరూపం.

1958 ఆగష్టు 15న ప్రారంభమైన అన్నపూర్ణాలయం గూడులా రూపుదిద్దుకుని, కాలక్రమేణా నేడు మేడలాగా మారింది. బిడ్డలకు అన్నం పెట్టటమే అమ్మకు ఒక మహాయజ్ఞం. నిరంతరం సాగే ఈ కార్యక్రమానికి అమ్మ 'మాతృయాగం' అని పేరుపెట్టింది.

అమ్మ గుండె అన్నపూర్ణాలయం. ఆ గుండె చప్పుడే అన్నపూర్ణాలయంలోని ఘంటారావం.





# 5. అన్ని బాధల కన్నా ఆకలి బాధ గొప్పది

ఒకసారి ఎ.వి.ఆర్. సుబ్రహ్మణ్యంగారు అన్నపూర్ణాలయంలో వడ్డన చేస్తూ ఉండగా చిల్లర సరుకులు అమ్ముకునే నలుగురు వర్తకులు భోజనానికి వచ్చారు. వ్యాపారం నిమిత్తం వచ్చిన వారికి అన్నం పెట్టాలా వద్దా! అనే సంశయం కలిగి అమ్మనే అడుగుదామని అనుకుంటూ అమ్మ గది తలుపు తట్టి లోపలికి వెళ్ళారు. గదిలో కాలు పెట్టగానే "అన్నం పెట్టటానికి కూడా పర్మిషను ఏమిటిరా? వచ్చినవాడి ఆకలిని బట్టి అన్నం పెట్టాలి. ఆకలితో జిల్లెళ్ళమూడి రావచ్చు గాని, ఆకలితో జిల్లెళ్ళమూడి వదలిపోకూడదు, అన్ని బాధల కంటె ఆకలి బాధే గొప్పది. డ్రెస్సు, అడ్రస్సు పరిగణించవద్దు"ని అమ్మ చెప్పగానే సరాసరి అన్నపూర్ణాలయం చేరి ఆ నలుగురు సోదరులను కుశల ప్రశ్నలు వేసి మీరు తృప్తిగా అన్నం తినివెళ్లటమే అమ్మ అభిమతమని వారికి చెప్పి తన ప్రవర్తనను మన్నించమని వారిని అభ్యర్థించి వారికి భోజనం పెట్టించారు సోదరులు ఎ.వి.ఆర్.సుబ్రహ్మణ్యం గారు.





# 6. అమ్మ వాక్యం - బ్రహ్మ వాక్యం

అమ్మ ఒడిలో పసివానిగా సేదతీరటం, అమ్మ చేతి గోరుముద్దలు తినటం నా అలవాటు, నా భాగ్యం. అమ్మకి అనారోగ్యం చేయటం వలన చాలాకాలం ఆ అవకాశం లభించలేదు.

ఒకనాడు అమ్మ సన్నిధిలో ఉన్నాను. "అమ్మా! ఇవాళ నీ చేత్తో అన్నం పెట్టు అమ్మా!" అని అడిగాను. అమ్మకి ఓపిక అసలు లేదు. లేని ఓపిక తెచ్చుకున్నది. వసుంధరక్కయ్యను పిలిచి పదార్థాలు తెప్పించింది. నేయి వేసి ముద్దలు చేసి నా చేతిలో పెడుతోంది.

అమ్మ అనురాగాన్ని రంగరించి పోసిన ఆ ముద్దల్ని తింటున్నాను. ఈ స్థితిలో అమ్మను బాధపెడుతున్నాననే వ్యధతో మనస్తాపం కలిగింది. ఒక కంటి వెంట ఆనందాశ్రువులు, మరొక కంటి వెంట దుఃఖాశ్రువులు ఏకధారగా వర్షిస్తున్నాయి.

ఆ సమయంలో అమ్మ ఎంతో సంతోషంగా ఉత్సాహంగా ఉంది. "అమ్మా! నీ చేతి మీదుగా అన్నం తింటూంటే చాలా హాయిగా ఉందమ్మా" అన్నాను.

అమ్మ చిరునవ్వుతో

"తినే వాడికే ఇంత హాయిగా ఉంటే,

పెట్టేవాడికి ఎంత హాయిగా ఉంటుంది? నాన్నా!" అన్నది.



# 7. నీ చేత పెట్టించటమే నీకు పెట్టటం

వాత్సల్యయాత్రలో భాగంగా ఒకసారి అమ్మ హైదరాబాద్‌లో మురికివాడల్నీ, జైళ్ళనీ, ఆస్పత్రులనీ సందర్శిస్తోంది. మార్గమధ్యంలో ఒక వ్యక్తి తలపై కట్టెల మోపు పెట్టుకుని, దానిని రెండు చేతులతో పట్టుకొని రోడ్డు ప్రక్కగా నడుస్తున్నాడు. అతనిని చూచి అమ్మ కారు ఆపమన్నది.

అమ్మకారుని అనుసరిస్తున్న సో॥శ్రీ ఎమ్. యస్. ఆర్. ఆంజనేయులు గారిని దగ్గరకు పిలిచింది. పులిహోర ప్రసాదాన్ని తీసికొని వెళ్ళి, ఆ కట్టెలు మోసుకునే వానికి పెట్టమని చెప్పింది.

ఆతని రెండు చేతులూ కట్టెల మోపుకి ఆధారంగా ఉన్నందున ఆంజనేయులు గారు ప్రసాదాన్ని అతని నోటికి అందించారు ఆదరణగా. తిరిగి వచ్చి "అమ్మా! నాకూ ప్రసాదం పెట్టమ్మా!" అని అడిగారు.

"నీ చేత పెట్టించటమే నీకు పెట్టటం, నాన్నా!" - అన్నది అమ్మ. అది సకల వేదసారం. అమ్మ ఆచరణాత్మక ప్రబోధం.





# 8. అమ్మ ఆవేదన

ఒక రోజు నేను, మరికొంతమంది అమ్మదర్శనం కొరకు కారులో జిల్లెళ్ళమూడి వస్తున్నాము. కారువేగంగా వెళుతోంది. ఇంతలో ఒక కుక్క ఆర్తనాదం వినిపించింది. మావాళ్లు కారు ఆపలేదు. నేనుచెప్పినా వాళ్లు కారు ఆపే పరిస్థితిలో లేరు. ఈ సంఘటన నా మనస్సును బాగా కలచివేసింది.

ఆ కుక్క మా కారు క్రిందేపడి ఆర్తనాదం చేస్తోందేమోననిపించి "అది చనిపోతే దాని కొక మంచి జన్మయివ్వమ్మా' అంటూ అమ్మను ప్రార్థన చేశాను. జిల్లెళ్ళమూడి చేరి అమ్మదర్శనం చేసుకుని, అమ్మ కెదురుగా కూర్చొని, మార్గమధ్యంలో జరిగిన సంఘటనను, కుక్క చేసిన ఆర్తనాదాన్ని, నా ప్రార్థనను, అమ్మకు వివరించాను.

అపుడు అమ్మ "మంచి జన్మ అంటేనో!" అంటూ వివరణ యివ్వడం ప్రారంభించింది.

"నాన్నా ! యిక్కడ ఒక ఆడకుక్క, మగకుక్క ఉండేవి. ఆడకుక్క ప్రసవించి కొన్ని పిల్లలను పెట్టింది. ఒకరోజు రెండు కుక్కలు పోట్లాడుకున్నవి. ఆ పోట్లాటలో ఆడకుక్క పొదుగు చీల్చి వేయబడటంతో రక్తం ధారగా కారుతోంది. ఆ భాగం అంతా కుక్క నుండి వేరుపడిందా అన్నంతగా చర్మం వ్రేల్లాడుతున్నది. ఆ చీలిన భాగాన్ని పట్టుకుని పిల్లలు పాలుత్రాగుతూ ఉన్నాయి. పాలనుకుని అవి నెత్తురునే పీలుస్తున్నాయి. ఆ స్థితిలో కూడా తన బిడ్డలకు పాలిస్తున్నాననే తృప్తితో ఉంది. అదే మనుష్యులలో చూడలేకపోతున్నాము" అంటూ ఎంతో చలించిపోయి తన ఆవేదనను వ్యక్తం చేసింది.



# 9. వర్గం లేనిది స్వర్గం

1984 మే 5వ తేదీన జిల్లెళ్ళమూడి గ్రామస్థులందరిని ఆహ్వానించి సత్కరించమని సంస్థవారిని అమ్మ ఆదేశించింది. సుమారు వెయ్యిమంది గ్రామస్థులు వచ్చారు. ఆవరణంతా నిండిపోయింది.

సాయంత్రం ఆరుగంటలకల్లా ప్రత్యేకంగా అలంకరింపబడిన సింహాసనం మీద అమ్మ ఆసీన అయింది. గ్రామస్థులకు స్వాగతం పలికి సత్కరించటానికి వసుంధర, శేషు, వైదేహి మొదలైన అమ్మ పరివారం అక్కడ సిద్ధంగా ఉన్నది.

కులమత విచక్షణ లేకుండా వచ్చినవారందరికి కొందరు పసుపు రాస్తుంటే, కొందరు కుంకుమ దిద్దుతూంటే, కొందరు గంధం రాస్తుంటే, కొందరు పన్నీరు చల్లుతుంటే, కొందరు తలలోకి పూలు ముడుస్తూంటే, కొందరు గాజులు వేస్తున్నారు.

ఆశ్రమవాసులంతా అలా గ్రామస్థులను సన్మానిస్తుంటే, వారు మా కాళ్ళకు మీరు పసుపురాయడమేమిటని కాళ్ళు వెనక్కి లాక్కుంటూంటే - బ్రతిమలాడి వాళ్ళ కాళ్ళకు పసుపు రాస్తున్నారు. ఆ దృశ్యం చూస్తుంటే అమ్మ చెప్పినట్లు "వర్గం లేనిది స్వర్గం" అన్న సూక్తి గుర్తు రాకతప్పదు.

వారందరిని అమ్మ పేరుపేరునా దగ్గరకు పిలిచి నూతన వస్త్రాలను పెట్టింది; విందు భోజనం ఏర్పాటు చేసింది. వారు సంతోషభరితులయ్యారు. వారిని చూచి అమ్మ మురిసిపోయింది.

ఆ దృశ్యాన్ని ప్రత్యక్షంగా చూసినవారు లోకంలో తన ప్రేమతత్వాన్ని ఆచరణ ద్వారా బిడ్డలకు బోధించటానికి అమ్మ ఏర్పాటు చేసిన కార్యక్రమం ఇదిగదా అనిపించింది.



# 10. మనిషిని యేడిపించేది మంచితనమే

ఒకనాడు ఒక సోదరుడు తన భార్యను వెంట పెట్టుకుని అమ్మ దర్శనానికి వచ్చారు.

అతను చాలా మనస్తాపంతో ఉన్నట్లుగా గమనించిన అమ్మ అతనిని దగ్గరకు పిలిచి "చెప్పునాన్నా! ఏమిటి బాధపడుతున్నా"వంటూ లాలనగా అడిగింది.

తన భార్య అవివాహితుడైన మరొక యువకుని ప్రేమించి, వివాహము చేసుకొనుటకు నిశ్చయించుకున్నానని తనతో చెప్పింది.

"ప్రాణం కన్నా ఎక్కువగా ప్రేమించే నా భార్య క్షేమమే ముఖ్యమనుకుని నా భార్య కోరికను అంగీకరించి, విడాకులు యిచ్చాను. కాని ఆమె ప్రేమించిన ఆ యువకుని తల్లిదండ్రులు "ఇద్దరు సంతానం గల వివాహితస్త్రీని" వివాహం చేసి కొనుటకు అంగీకరించనందున నా భార్య ఆత్మహత్యాప్రయత్నం చేసి నా చేతనే రక్షింపబడింది. ఆమె క్షేమమే ముఖ్యమని మీ దర్శనం కోసం ఆమెను ఇక్కడకు తీసుకొచ్చానమ్మా" అంటూ వారి గాధను అమ్మకు వివరించాడు. ఆ విషాదగాధ వింటున్నంతసేపు అమ్మకన్నులు జలజలా వర్షించాయి. వారి చరిత్ర విన్న అమ్మ "నన్ను కొట్టి, తిట్టి, ఎవరూ ఏడిపించలేరు. మీ మంచితనమే నన్ను ఏడిపిస్తుంది" అన్నది.

అతని మంచితనానికి, సహనానికి, అమ్మ చలించిపోయి అతనిని జాలిగా చూచింది, ప్రేమతో ఓదార్చింది.

"ఇంతటి మంచిమనిషిని మోసం చేయలేనమ్మా అంటూ" అతని భార్య ఏడ్చింది. "మనిషిని యేడిపించేది మంచితనమేనమ్మా" అంటూ ఆమెను దగ్గరకు తీసుకుని, ఓదార్చి, ఇద్దరకూ, బొట్టుపెట్టి, నూతన వస్త్రాలను ప్రసాదించి, ఇద్దరి మెడలో దండవేసి, మల్లెపూల జల్లులతో వారిపై అమ్మ అనుగ్రహ వర్షాన్ని కురిపించింది.

భార్యభర్తలిరువురూ అమ్మ పాదపద్మములను పూలతో అర్చించుకుని ఆనందపరవశులైనారు.

ప్రేమించటం అమ్మకు సహజం; అది బిడ్డల గుణగణాలను చూచికాదు.



# 11. సహజ సహనం

రాజు బావ అనే సోదరుడు 'సహనమే నీ సొంత సొమ్మా' అంటూ అమ్మ మీద ఒక పాట వ్రాశాడు. అది విన్న ఒక సాధువు అమ్మ దగ్గరకు వచ్చి అమ్మను పరీక్షించాలని అమ్మ మీద రాళ్లు, పిడకలు విసిరేవాడు. అంతేకాదు. దురదగుండు ఆకు తీసుకు వచ్చి అమ్మ మీద విసిరే వాడు. ఎన్ని చేస్తున్నా ఏమీ అనేది కాదు; అన్నీ భరించేది భూమాత లాగా. "అమ్మ సహనదేవత. సహనమే అమ్మ అంటూ" అమ్మకు నమస్కరించి పశ్చాత్తాపంతో తిరిగివెళ్ళాడు.

అమ్మ సహనాన్ని పరీక్షించాలని జిల్లెళ్ళమూడిలో ఉండే మిషను సాయిబు అనే ఒకతను అమ్మను ఎప్పుడూ దూషిస్తూ ఉండేవాడు. వేళ కాని వేళల్లో మరొకతనిని తీసుకొచ్చి అన్నం పెట్టమనేవాడు. అమ్మ ఏమీ అనకుండా వారిద్దరికి అన్నం పెట్టేది ఆప్యాయంగా. యింకా పరీక్షించాలని వంట యింటిలోనికి వెళ్లి మలవిసర్జన చేశాడు. తెలియని పసిపిల్లవాడు అలా చేస్తే ఏ విధంగా కోపించమో అలాగే అమ్మ ఏమీ అనకుండా ఆ స్థలాన్ని శుభ్రం చేసి అతనికి అన్నం పెట్టింది. ఈ సంఘటనతో, సహనదేవత అయిన అమ్మను తాను పరీక్షించలేనని, చేతులు జోడించి శిరస్సు వంచి తన ఓటమిని అంగీకరించి వెనుదిరిగిపోయాడు.

**"బాధలు భరించటం సహనం-**
**బాధే అనిపించకపోవటం సహజసహనం"**
**అనేది అమ్మ వాక్యం.**



## 12. దేవుడంటే అమ్మే

కాసు రాధాకృష్ణరెడ్డి, వెంకటేశ్వరరెడ్డి అనే ఇద్దరు అంధసోదరులు ఉండేవారు. వారు సంగీతశాస్త్రంలో గొప్ప విద్వాంసులు. రాధాకృష్ణరెడ్డి నాదోపాసకుడు, భక్తుడు. తనగానామృతం చేత దేవతలనైనా మెప్పించగలవాడు. కాగా పరీక్షించకుండా దేనినీ విశ్వసించరాదనే నిశ్చిత అభిప్రాయం కలవాడు.

రాధాకృష్ణరెడ్డి జిల్లెళ్ళమూడి వచ్చి కొంతకాలం ఉండి, అమ్మను రకరకాలుగా పరీక్షించాడు. ఒకసారి అమ్మపాదాలకు నమస్కరించినట్లు తన తలను అమ్మ పాదముల బొటన వ్రేళ్ల గోళ్లపై మోదుతుంటే రక్తం స్రవించింది. అయినా అమ్మ ఏమీ అనలేదు. పైగా పుత్రవాత్సల్యంతో వారు కోరినవన్ని ఆదరంగా చేయించి పెట్టింది. అమ్మ అపూర్వసహనానికి, అద్భుత ప్రేమ తత్త్వానికి పరవశుడై "దేవుడంటే వీడేరోయ్" అని ఉచ్చైస్వరంతో కేకలు వేస్తూ పాదాక్రాంతుడయ్యాడు.

ఇంకొక విశేషమేమంటే ఆ సమయంలో అమ్మ పాదము లందు అనేక దేవీ దేవతల రూపాలను దర్శించాడు, అనేక మంత్రములు, నాదములను కూడా విన్నాడు. అమ్మను పరీక్షించినందుకు పశ్చాత్తాపం చెంది కన్నీటితో అమ్మ పాదాలను అభిషేకించాడు.

అమ్మది సహజసహనం, సహజ మాతృత్వం, సహజవాత్సల్యం అంటూ పరిపూర్ణ శరణాగతుడైనాడు. జీవితాంతం అనేక నామ సప్తాహాలు చేసి, సంగీత విద్యను అమ్మకు అంకితం చేసి "అమ్మ స్వయంభూపరమాత్మ, దేవుడంటే అమ్మే" అనే అచంచల విశ్వాసంతో అమ్మ కృపకు పాత్రుడై 1997లో అమ్మలో ఐక్యం అయ్యాడు.



# 13. మీతో నేను నాతో మీరు

1977వ సంవత్సరం నవంబరు నెలలో దివిసీమను కుదిపి వేసిన ఉప్పెనవల్ల తీరానికి దగ్గరగా ఉన్న జిల్లెళ్ళమూడి గ్రామం అతలాకుతలం అయింది. అందరూ నిరాశ్రయులయ్యారు. అపుడు వారందరికి అన్నపూర్ణాలయంలో వంటలు చేయించి పెట్టించింది అమ్మ. అమ్మ ఉన్నదన్న కొండంత గుండె ధైర్యంతో అమ్మ సాన్నిధ్యంలో కాలం గడిపారు అక్కడి వారందరు.

అమ్మ భవనం చుట్టూ ఉన్న వరదనీరు అంతా దుర్వాసనతో నిండి పోయి అసహ్యకరమైన వాతావరణం; స్నానానికి నీళ్లులేవు, త్రాగటానికి నీళ్ల లేవు, కరెంటు లేదు. ఈ పరిస్థితులలో అమ్మ యిక్కడ ఉండటం కష్టమని తోచిన ఆశ్రమ నిర్వాహకులు పరిస్థితులు అనుకూలించేవరకు నీవు ఎక్కడయినా ఉంటే బావుంటుందని అమ్మతో వారి అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

వారి అభిప్రాయం విన్న అమ్మ "నిజమే, నాకు బాగానే ఉంటుంది. నన్నయితే ఎవరయినా ఆహ్వానిస్తారు, తీసికెళతారు, అన్ని సౌకర్యాలు చేస్తారు. ఈ వేలాది మంది బిడ్డల మాటేమిటి? వీళ్లందరిని ఎవరు భరిస్తారు? ఈ కష్టసమయంలో మిమ్మల్ని వదిలేసి నా సుఖం నేను చూసుకునేదా? అది నా వల్ల కాదు. నా ఉనికే కొండంత ఊరట. కొండంత ధైర్యం. కష్టమో, సుఖమో; మీతో నేను, నాతో మీరు; అన్నది అసలైన అమ్మ.





# 14. కనువిప్పు

ఒకసారి చీరాల సో॥శ్రీ పొట్లూరి సుబ్బారావు గారు అమ్మ సన్నిధిలో ఉండగా అక్కడికి ఒక బురదపూసుకున్న కుక్క వచ్చింది. అందరూ దానిని 'ఛీ ! ఛీ! అని తరిమికొట్టారు. అప్పుడు ఆ సోదరులు "అమ్మా! ఏ జన్మ యిచ్చినా ఫరవాలేదు గానీ, కుక్క జన్మ మాత్రం ఇవ్వద్దు" అని మనస్సులోనే అమ్మను ప్రార్థించారు.

కొంతసేపటికి అదే కుక్క మళ్ళీ అమ్మ దగ్గరికి వచ్చింది. అమ్మకి ఎదురుగా నిటారుగా కూర్చుంది. కొద్దిసేపట్లోనే బిగుసుకుపోయి, కళ్ళు మూసుకుని, నిశ్చలంగా ఉండిపోయింది.

సుబ్బారావు గారు వైద్యులు, యోగసాధకులు. ఆశ్చర్యపోయి దాని వద్దకు వెళ్ళి పరిశీలించారు. దాని శ్వాసను గమనించి, కంటి రెప్పలుపైకెత్తి చూడగా, కనుగుడ్లు రెండూ ఒక కొలిక్కి వచ్చాయి. అది సమాధిస్థితిని పొందిందని తెలుసుకున్నారు. వారికి కనువిప్పు కలిగి అమ్మకు సాష్టాంగనమస్కారం చేశారు.

"అమ్మా ! నాకు ఏ జన్మ ఇచ్చినా ఫరవాలేదు గానీ, ఆకుక్కకు అనుగ్రహించిన సమాధిస్థితిని ఇవ్వమ్మా" అని ప్రార్థించారు. అమ్మ చిరునవ్వు నవ్వింది.

అమ్మ సన్నిధిలో ఉండే జంతువులు కూడా యోగసమాధిలో ఉంటాయని తెలుసుకున్నారు డాక్టరు గారు. శరీరం ఏదైనా ఉన్నతస్థితులను ప్రసాదించాలంటే అమ్మకు ఏదీ అడ్డుకాదు.



బిడ్డ బురద పూసుకున్నా
కడిగి దగ్గరకు తీసుకునేదే అమ్మ

\- అమ్మ

# 15. యోగేశ్వరి

శ్రీ మురాల నారాయణరావుగారు నా చిరకాల స్నేహితులు. వారు యోగసాధనలో ఉన్నత భూమికలను అధిరోహించారు. కాగా వారికి ప్రాణాయామ విధానం గురించి కొన్ని సందేహాలున్నాయి. వాటిని మహామహితాత్మురాలు అమ్మ సన్నిధిలో నివృత్తి చేసుకోవాలనుకున్నారు.

ఇరువురం అమ్మ సన్నిధిలో కూర్చున్నాం. అమ్మ నాతో చనువుగా ఏవేవో మాట్లాడుతున్నది. ఆయన మౌనంగా ఉన్నారు. అలా కొంతసమయం అయిన తర్వాత "అప్పారావు గారూ ! వచ్చిన పని పూర్తి అయింది. వెళదాం. పదండి" అన్నారు ఆయన. తర్వాత మామధ్య ఇలా సంభాషణ సాగింది.

నేను : మీరు ఏవో సందేహాలను అడుగుతానన్నారు కదా!

నారా : అవును.

నేను : మీరేమీ అమ్మతో మాట్లాడలేదు.

నారా : నేను అమ్మను ప్రశ్నించనవసరం లేకుండానే సందేహం తీరింది.

నేను : ఎలా?

నారా : మీరు అమ్మతో మాట్లాడుతున్న సమయంలో ఒక కుక్క వచ్చింది కదా!

నేను : అవును !

నారా : అది శ్వాసను ఎలా బలంగా పీల్చి, వదలాలో ప్రదర్శించింది. ప్రాణాయామ పద్ధతి ఎలా ఉండాలో ఆ కుక్క ద్వారా అర్థమైంది. ఇది మనకి అర్థం కాని అమ్మ దివ్యశక్తి ప్రభావం.

యోగేశ్వరి అయిన అమ్మకు నారాయణరావు భక్తితో ప్రణమిల్లారు. అమ్మ అనుగ్రహం ఉంటే మనుష్యులే కాదు, పశుపక్ష్యాదులూ యోగులౌతాయి.



# 16. ప్రాణప్రదాయిని

మన్నవ రామబ్రహ్మం గారి కుటుంబం అంతా అమ్మ యందు విశ్వాసం కలవాళ్ళు. వారి కుమార్తె విద్యాధరి. ఆమె ప్రసవించటం ప్రమాదకరమైంది. వెంటనే పొన్నూరు ఆస్పత్రిలో చేర్పించారు. శిశువు గర్భంలోనే మరణించి ఉండవచ్చునీ, ఆపరేషన్ అవసరమనీ, కానీ ఆపరేషన్ చేస్తే తల్లి ప్రాణానికే ముప్పు అని డాక్టర్లు తేల్చి చెప్పారు. కుటుంబం అంతా శోకసముద్రంలో మునిగి ఉన్నారు.

ఆ ప్రసవవేదనకు తాళలేక విద్యాధరి "అమ్మా! నీవే దిక్కు" అని పరిపరి విధాల ప్రార్థిస్తోంది. 'నా పాలిట కాళివి అయ్యావా?" అని నిందిస్తోంది.

తక్షణమే అమ్మ విద్యాధరి మేనత్త ద్వారా ప్రసాదంగా కొన్ని పండ్లు పంపింది. రామబ్రహ్మంగారు ఆ ప్రసాదాన్ని తీసికొని త్వరత్వరగా ఆస్పత్రికి వెళ్ళారు. ఆ సమయంలో వారికి తోడుగా అమ్మ, వారి ప్రక్కనే నడుస్తున్నట్లు అనుభూతి చెందారు.

విద్యాధరి భక్తిశ్రద్ధలతో అమ్మ ప్రసాదాన్ని స్వీకరించింది. వెంటనే ఒక విచిత్రమైన అనుభవం కలిగింది. తన మంచం కోడు మీద నిలువెత్తుగా ఒక సర్పం కనిపించింది. అది వెలుగుగా మారి తన గర్భాన్నుంచి మృతశిశువును బయటకు నెట్టివేసింది.

అది కలకాదు; కల్లా కాదు. నిజమైంది. విద్యాధరి బాధా నివారణ అయింది; బ్రతికి బట్టకట్టింది. విద్యాధరి బ్రతకటం వైద్యశాస్త్రానికి ఒక సవాల్ అయింది.



# 17. రక్షణే తల్లి

1973లో శ్రీ దినకర్ అన్నయ్య ఆరోగ్యం బాగా దెబ్బతింది. అల్సర్ అని వైద్యులు నిర్ణయించి మందులు వాడుతున్నారు. బాగా బలహీనపడ్డాడు. ఆహారం ఏమీ తీసికోలేని విషమపరిస్థితి ఎదురైంది. స్వర్ణోత్సవాల్లో పాల్గొన లేకపోతున్నానని దుఃఖం వచ్చింది.

ఆ స్థితిలో జిల్లెళ్ళమూడి వచ్చి అమ్మ సన్నిధిలో కూర్చున్నాడు. అన్నయ్యను చూచి కలత చెంది అమ్మ, "నాన్నా ! ఏమిటి అలా అయిపోయావు?" అని అడిగింది. "ఆరోగ్యం బాగాలేదమ్మా! నా వ్యాధి ఏమిటో నాకే అర్థం కావటం లేదు. డాక్టర్లకీ అర్థం అయినట్లుగా లేదు" అని బాధపడ్డాడు.

"నీకు ఆలోచనలు ఎక్కువ, నాన్నా ! ఇక నుండి నీ ఆలోచనలన్నీ నేను ఆలోచిస్తాను" అంటూ ఏవో కబుర్లు చెపుతూ తన చేతిలో ఉన్న గోధుమ హల్వాను గోరుముద్దలుగా చేసి తినిపించింది.

"ఇక నుండి నువ్వు వెళ్ళి నీ పనులు చూసుకో!" అని హామీ నిచ్చింది; చక్రాన్ని అడ్డు వేసింది. అంతే. అన్నయ్య ఆరోగ్యం పూర్తిగా బాగుపడింది. స్వర్ణోత్సవ కార్యక్రమంలో విరామం లేకుండా పనిచేశాడు. విచిత్రం ఏమంటే – అన్నయ్య గదిలో ప్రవేశించినపుడు అమ్మ చేతిలో ఏమీ లేదు. మరి హల్వా ఎక్కడిది? అది నిజమైన హల్వాయేనా? హల్వా రూపంలో ఉన్న మానవాతీత శక్తియా? దివ్యౌషధమా? ఏమో! అమ్మకే తెలియాలి.

అమ్మ అన్నయ్యను రక్షించిన తీరు అసాధారణమైనది, అర్థం కానిది.



# 18. అమ్మ చేయూత

ఒకసారి సో॥ శ్రీ యార్లగడ్డ రాఘవయ్యగారు అమ్మ శ్రీచరణాలను పవిత్ర సాగర సంగమ జలాలతో అభిషేకం చేయాలని సంకల్పించారు. కొందరు స్నేహితుల సాయంతో ఒక పడవలో కృష్ణానదీ సాగరసంగమ ప్రదేశానికి ప్రయాణం చేస్తున్నారు. కొన్ని మైళ్ళ దూరం వెళ్ళారు. పోను, పోను చుట్టూ జలమయం. ఎటు చూచినా తీరం కనపడటం లేదు. దిక్కు తెలియటం లేదు - దిక్కు తోచటం లేదు. మానవజీవితంలో వలెనే నదీజలాలకి ఆటుపోటులుంటాయి. "కొద్దిసేపట్లో ప్రవాహం పోటుకి తిరుగుతుంది. అంటే - పడవ నేరుగా సముద్రంలోకి కొట్టుకుపోతుంది. ఇక మన బ్రతుకు దైవాధీనం" అని అన్నారు పడవ సరంగులు. పిడుగులాంటి ఆ మాట విని రాఘవయ్య అన్నయ్య ఆర్తితో 'అమ్మ చేయూత' కోసం అమ్మ నామ సంకీర్తన ప్రారంభించారు.

ఆ సమయంలో పడవలో నిద్రిస్తూన్న ఒక సోదరి హఠాత్తుగా లేచి, 'అమ్మ నాకు దివ్యప్రభలతో దర్శనం ఇచ్చింది. సంజ్ఞాపూర్వకంగా తూర్పుదిశగా వెళ్ళమని మార్గాన్ని సూచించింది" అని చెప్పింది. వెంటనే సరంగులు 'అది వాస్తవం' అని నిశ్చయించుకుని ఆ దిశలో ప్రయాణించి పదినిముషాల్లో పడవను సురక్షితంగా ఒడ్డుకు చేర్చారు.

అమ్మ చేయూతని అనుభవించాల్సిందే.

అది కంటికి కనిపించదు.



# 19. తనయుని కొరకు తల్లి

1975లో వాత్సల్యయాత్రలో భాగంగా అమ్మ మద్రాసు పర్యటనలో ఉంది. అపుడు శ్రీ వి.యన్.శర్మగారు, “అమ్మా ! చలంగారు నిన్ను దర్శించుకోవాలను కుంటున్నారు. కాని వారు కదలలేని స్థితిలో ఉన్నారు” అని అమ్మకు వారి ఆవేదనని నివేదించారు. వెంటనే అమ్మ, “అయితే నేనే వెడతా, నాన్నా!” అని చెప్పింది.

ఆ రోజుల్లో అమ్మ ఆరోగ్యం అంతంత మాత్రంగా ఉండేది. కానీ మాతృ హృదయం అమ్మని నిలువనీయలేదు. 13.4.75 తేదీన బయలుదేరి అమ్మ తిరువణ్ణామలై వెళ్ళింది. తిన్నగా శ్రీ గుడిపాటి వెంకటచలం గారి ఆశ్రమానికి వెళ్ళింది. అమ్మదర్శనంతో నిలువెల్లా పులకరించారు చలంగారు. వారి శిరస్సును లాలనగా నిమురుతూ తన గుండెలకు హత్తుకున్నది అమ్మ. ఆయన ఆనందభాష్పాలు రాలుస్తూ గద్గదస్వరంతో “అమ్మా! వృద్ధుడను, లేచి తిరుగలేని వాడిని. నువ్వే నా దగ్గరకు రావటం చాలా ఆనందంగా ఉంది” అన్నారు. అమ్మ ఆశీఃపూర్వకంగా వారికి నూతన వస్త్రాలను పెట్టుకున్నది.

“నేను ఎన్నో సంవత్సరాలు ఈశ్వరాన్వేషణ చేశాను. ‘ఏడిరా నీ ఈశ్వరుడు?’ - అని ఎవరైనా అడిగితే నాకు ఈనాడు చెప్పటం సులభం అయింది” అంటూ అమ్మను చూపిస్తూ అమ్మకు పాదాభివందనం చేశారు. పిమ్మట సౌరీస్‌ను కూడా దగ్గరకు తీసుకుని అమ్మ లాలించింది. ఆ సోదరి అమ్మ ఒడిలో పురిటిబిడ్డలా ఒదిగిపోయింది.

తర్వాత శ్రీ రమణాశ్రమ ట్రస్టీ శ్రీ వెంకట్రామన్ గారి ఆహ్వానం మేరకు అమ్మ రమణాశ్రమ ప్రాంగణంలో అడుగు పెట్టింది. ఆశ్చర్యం. మరుక్షణం అక్కడి చెట్లపై విశ్రమించిన నెమళ్ళు ఒక్కసారి క్రిందికి దూకాయి. ‘సాగిరావమ్మా! స్వాగతం!’ అన్నట్లు అమ్మ రాకకు తమ ఆనందాన్ని వెలిబుచ్చుతూ పింఛాలను విదిల్చి మనోహరంగా నృత్యం చేశాయి.

వాత్సల్యమూర్తి అమ్మను చూసినంతనే - చలంగారు మాటలలో స్పందిస్తే, నోరులేని నెమళ్ళు నృత్యం చేస్తూ తమ పులకరింతను తెలియజేశాయి.



## ౨౦. పసిహృదయానికి స్పందించిన అమ్మ

ఒకసారి గోపాల్ అన్నయ్య తన ఐదేళ్ళ మనవడు అనిరుద్ధ్ ను వెంటబెట్టుకుని, అమ్మ ఆలయాన్ని హైమ ఆలయాన్ని దర్శించుకుని అలంకార హైమాలయానికి – అంటే అమ్మ నివసించిన పూరింట్లోకి వచ్చారు. అమ్మ పాదాలకు నమస్కరించుకుని కూర్చున్నారు. హాయిగా సేదతీరుతున్నారు. అది వేసవి కాలం. అందునా మధ్యాహ్నం గం. 1-00 సమయం. ఆ పసివాడు అనిరుద్ధ్ అక్కడ ఉన్న మంచం చూశాడు. తర్వాత తాత – మనవడు మధ్య సంభాషణ ఇలా సాగింది.

అనిరుద్ధ్ : తాతయ్యా ! ఈ మంచం ఏమిటి?

గోపాల్ : ఇది అమ్మ పడుకున్న మంచం రా.

అ: అమ్మ ఇపుడు కూడా ఈ మంచం మీద పడుకుంటుందా?

గో: ఆ – పడుకుంటుంది.

అ: ఇంత ఎండలో ఉక్కపోస్తూ అమ్మ ఆలయంలో ఎంత సేపని ఉంటుంది? ఆ అమ్మను, రెండో ఆలయంలో ఉన్న దేవుడిని వచ్చి, ఈ మంచిమీద పడుకోమని చెప్పు తాతయ్యా.

గో: వాళ్ళు రాత్రి పూట పడుకుంటారు. ఇప్పుడు పడుకోరురా.

అ: అట్లా కాదు. నువ్వు గట్టిగా పిలువు. వాళ్ళు వచ్చి పడుకుంటారు.

వాడి మాటలు విన్న గోపాల్ అన్నయ్య ఆ పసివానికున్న భక్తి విశ్వాసాలు తనకు లేవు కదా! అని బాధపడుతూ 'సరే. పిలుస్తాలే' అంటూ భోజనాలకు వెళ్ళారు. ఆ రోజుల్లో శ్రీ అనసూయేశ్వరాలయం చుట్టూ కొండరాళ్ళతో గోడకడుతున్నారు. పనివాళ్ళు ఆలయ వెనుకభాగంలో పడుకునే వారు. కల్లకపటం ఎరుగని ఆ చిన్నారి హృదయానికి స్పందించిన అమ్మ, హైమ – ఇరువురూ ఆ రాత్రి ఆలయాల నుండి బయలుదేరి ఆ పని వాళ్ళందరినీ దాటుకుంటూ ఆ పూరింట్లోకి వెళ్ళి పడుకున్నారు. తిరిగి తెల్లవారుఝామున ఆలయాలకు చేరారు. ఇదంతా పనివాళ్ళు చూస్తూనే ఉన్నారు. ఈ సంగతి రెడ్డి సుధ ద్వారా తెలుసుకున్న గోపాలన్నయ్య ఆశ్చర్యపోయాడు.

ఆ పసిహృదయానికి స్పందించిందేమో! అమ్మ!



# 21. తల్లికై తల్లడిల్లిన పసిహృదయాలు

అది ఒక విశాలమైన ఆవరణ. బారులు తీరిన కొబ్బరిచెట్లతో చాలా అందంగా ఉంది.

అది ఏలూరుకు సమీపగ్రామమైన శనివారపుపేటలోని బాలనేరస్థులకు శిక్షణ యిచ్చే ప్రభుత్వ బాలుర కారాగారము.

తెలిసీ తెలియని వయస్సులో ఏవో నేరాలకు పాల్పడిన పిల్లలను సంస్కరించే పాఠశాల అది. అందులో 10 నుండి 14 సంవత్సరముల వయస్సులో ఉన్న పిల్లలు 359 మంది ఉన్నారు.

వాళ్లలో సత్ప్రవర్తన కల్గించటానికి ప్రయత్నించడమే కాక వాళ్లు పెరిగి పెద్దవాళ్లయిన తరువాత బ్రతుకు తెరువుకు అవసరమయిన కుట్టుపని, తోటపని మొదలయిన పనులను నేర్పుతూ శిక్షణ యిస్తున్నారు.

1973లో అమ్మ యేలూరు వచ్చినప్పుడు ప్రభుత్వ వైద్యులు డాక్టర్ అమలేశ్వరరావుగారి ఆహ్వానంపై అమ్మ అక్కడకు వెళ్లింది. అమ్మతోపాటు, మేమందరము కూడా వెళ్లాము.

అమ్మ ప్రేమలోని కమ్మదనానికి దూరమై, తల్లికోసం తల్లడిల్లిపోయే ఆ పసివాళ్లకు అమ్మను చూడగానే ఒక్కసారి ప్రాణం లేచి వచ్చినట్లయింది. అమ్మ దగ్గరకు వచ్చి అమ్మ ఒడిలో చేరాలని, అమ్మ స్పర్శలోని మాధుర్యాన్ని అనుభవించాలని, ఆపసిహృదయాలకు అనిపించినా, ఆ పాఠశాల క్రమశిక్షణను ఉల్లంఘించినట్లవుతుందని ఆపని చేయలేకపోయారు.

వాళ్ల స్థితిని గమనించిన అమ్మ ఆప్యాయత, అనురాగం, పొంగులు వారుతుండగా తానే వాళ్ల దగ్గరకు వెళ్లింది. తల్లిదండ్రుల నీడలో అల్లారుముద్దుగా పెరగవలసిన ఆపసివాళ్లను చూచి అమ్మ హృదయ కరిగిపోయింది.

వాళ్లను చూచి, చలించిపోయిన అమ్మ కంటివెంట నీరువస్తుండగా, ఆపుకుంటూ, ఎంతోగోముగా, వాళ్లను దగ్గరకు తీసుకుని, ప్రేమతో వాళ్ల తలలు నిమిరి, "నాన్నా! అమ్మను చూడాలని వుందా!" అని గద్గద కంఠంతో అడిగింది.

వాత్సల్యపూరితమైన అమ్మ మాట విని, పిల్లలందరు ఒక్కసారిగా బావురుమని ఏడ్చేశారు.

అక్కడే ఉండి ఈ సన్నివేశాన్ని చూస్తున్న మా అందరి హృదయాలు ద్రవించాయి.

అమ్మ డాక్టరు అమలేశ్వరరావు గారిని పిలిచి "వాళ్లకు తల్లీ, తండ్రీ అన్నీ నీవయి, జాగ్రత్తగా చూడు, నాన్నా!" అని చెప్పింది.

అమ్మ వాత్సల్యామృతాన్ని చవిచూసిన ఆ చిన్నారులు అమ్మను వదలలేకపోతున్నారు.

అమ్మను వాళ్లు వదలలేరు. అమ్మ వారిని వదలలేదు. కాని తప్పదు గదా! వారి కన్నీటిని అమ్మ తనపైట చెంగుతో తుడిచి "అమ్మను చూచారుగా" అంటూ వాళ్లను వదలలేక, వదలలేక ఎంతో భారంగా ఆ ప్రదేశాన్ని విడిచిపెట్టింది.

తల్లికై తల్లడిల్లుతున్న ఆ పసివారిని చూచిన ప్రతివారికి కంటి వెంట నీరురాక తప్పదు'. ఆనాటి సన్నివేశాన్ని ఇన్నేళ్ల తరువాత తలచుకున్నా అప్రయత్నంగా కన్నులు అశ్రుపూరితాలవుతున్నాయి.





## 22. "వాటి బాధ వాళ్ళమ్మతో చెప్పుకుంటాయి"

1977లో పెనుతుఫాను తాకిడికి జిల్లెళ్ళమూడి గ్రామంలో చెట్లూ, ఇళ్లూ ధ్వంసమైనాయి. కరెంటు స్తంభాలు వంకరలు తిరిగాయి. జనజీవనం కుప్ప కూలింది.

ఆ భీభత్సం తగ్గిన తరువాత నేను జిల్లెళ్ళమూడి వెళ్లాను. అమ్మ చరణసన్నిధిలో కూర్చున్నాను. అమ్మ ఆవేదనతో, "నాన్నా! ఎంతో వేగంగా గాలి వీచింది. భోజనశాల మీది రేకులు ఎగిరి దూరంగా కొట్టుకుపోయి, ముక్కలు అవుతున్నాయి. క్రింద గుంజలకి కట్టేసిన పశువులకు ఏ ఒక్కరేకు తగిలినా ప్రాణం ఉండేది కాదు. అవి 'అంబా! అంబా!' అంటూ ఆర్తనాదాలు చేశాయి. ఒక్కరు కూడా వెళ్ళివాటికట్లు విప్పలేదు. ప్రొద్దున్నే పాలకోసం మాత్రం పాత్ర తీసుకుని వెళ్తారు. అదృష్టవశాత్తూ ఒక్కరేకు కూడా ఒక్క పశువుకు కూడా తగలలేదు, నాన్నా!" అంటూ తన మనస్తాపాన్ని వ్యక్తం చేసింది.

అమ్మ బాధ నన్ను కళ్ళనీళ్ల పర్యంతం చేసింది. చేతులు జోడించి, "అమ్మా! మాకు ఏదైనా బాధ వస్తే నీకు చెప్పుకుంటాం. మరి ఈ పశువులు వాటి బాధను ఎవరితో మొరపెట్టుకుంటాయి?" అని అడిగాను.

వెంటనే అమ్మ, "వాటి బాధ వాళ్ళ అమ్మకు చెప్పుకుంటాయి, నాన్నా!" అన్నది.





# 23. ఆవేదనే అమ్మకి పిలుపు

సో॥ శ్రీ రాధాకృష్ణశర్మగారి గృహప్రవేశ శుభసందర్భంగా అమ్మ గుంటూరు వెళ్ళింది. అక్కడి అనేకమంది సోదరీసోదరులు అమ్మను తమ తమ ఇండ్లకు రమ్మని అర్థించారు. వారిలో సోడాలు అమ్ముకుని జీవనం సాగించే కొండయ్య కూడా ఉన్నాడు. వణికే పెదవులతో, "మా ఇంటికి కూడా రా, అమ్మా!" అన్నాడు దీనంగా.

తక్షణం అమ్మ, "తప్పకుండా మీ ఇంటికి వస్తాను, నాన్నా! నా కోసం నువ్వు తిరగవద్దు; నా వీలుచూసుకుని వస్తాను. నా కోసం డబ్బు ఖర్చు పెట్టవద్దు; చీరెలు - సారెలూ కొనవద్దు. నువ్వు చినిగిన చొక్కా తొడుక్కుని, నాకు కొత్త చీరెపెడితే నాకు ఏమి హాయిగా ఉంటుందో, చెప్పు. నీ భార్యలక్ష్మితో చెప్పు; తను ఏది వండితే అదే తింటాను" అన్నది నిండుమనస్సుతో.

ఆ రాత్రే అమ్మ వాళ్ళింటికి వెళ్ళింది. అమ్మను చూసి సంతోషంతో ఆ దంపతులు ఉక్కిరిబిక్కిరి అయ్యారు. వాళ్ళ కాళ్ళూ చేతులూ ఆడలేదు. అమ్మ సరాసరి వాళ్ళ వంటగదిలోకి వెళ్ళింది. అక్కడి అన్నం, పులుసూ కలుపుకుని తిన్నది. "చాలా రుచిగా ఉన్నాయి, నాన్నా!" అని అమ్మ అంటూంటే వాళ్ళు సంబరపడిపోయారు. కుచేలుని వలె కొండయ్య ఆనందాశ్రువులను వర్షించాడు.

ఆ మర్నాడు శ్యామల అనే ఒక సోదరి ఇంటికి ఆహ్వానం లేకుండానే తానే కబురు చేసి వెళ్ళింది. శ్యామల వాళ్లది చిన్న అద్దె ఇల్లు. ఆ ఇంటి దారి చాలా ఇరుకు. మార్గంలో ఎన్నో అడ్డంకులు. కావున తమ ఇంటికి రావటం అమ్మకి కష్టం అవుతుందని అమ్మను పిలువలేదు. కానీ పిలువలేక పోయానే అనే ఆవేదన తనని బాధిస్తోంది. అమ్మ ఎన్ని బాధలైనా పడుతుంది; కానీ బిడ్డల బాధను చూసి తట్టుకోలేదు.

క్షణాల్లో అమ్మ శ్యామల వాళ్ళింటికి వెళ్ళింది; వాళ్ళ ఐశ్వర్యాన్ని చూసి కాదు, వాళ్ళ ఆవేదనని చూసి.



# 24. అమ్మ ఆదరణ

1962లో గురువాయిపాలెం నుంచి పుల్లయ్య అనే అంగవైకల్యం గల సోదరుని అమ్మ వద్దకు తీసుకువచ్చారు. అతడు కూర్చోలేడు, నిలబడలేడు; దృష్టిలేదు, చొంగకారుతూంటుంది. ఆశలు ఒదులుకుని, ఎందుకో అమ్మ దర్శనం కోసం తీసుకువచ్చారు.

అతనిని చూడగానే అమ్మ, "నాన్నా! నువ్వు ఇది వరకు వచ్చినట్లున్నావు" అన్నది. 'అవునమ్మా! కొన్ని ఏళ్ళ క్రితం బండి తోలుకుని వచ్చాను. నీ చేతి అన్నం తిన్నాను' అన్నాడు.

కొంతకాలం అమ్మ సన్నిధిలో ఉన్నాడు. ఎత్తుకుని తీసుకువచ్చి అమ్మ దర్శనం చేయించేవారు. 'అమ్మా! నాకు నయమైతే నన్ను ఉంచు. లేకపోతే నా ఎదుటే నా భార్యకు మరొక వివాహం చెయ్యి' అని దీనంగా ప్రార్థించేవాడు. 'ఈ బాధలూ, జబ్బులూ పోవాలని కోరుకోవటం లేదు. మనస్సు ఎల్లప్పుడూ నీమీద నిలబడేటట్లు చెయ్యమ్మా. ఈ అంగవైకల్యం రావటం ఒకందుకు మంచిదే" అని అర్థించేవాడు. కొన్నాళ్ళకు పుల్లయ్యను వాళ్ళ ఊరు తీసుకెళ్ళారు.

1962 జూన్‌లో అమ్మ చీరాల దగ్గర వాడరేవు వెళ్ళింది. ఒకనాడు పుల్లయ్య కోసం కారు పంపింది. పుల్లయ్య కోసం కారుపంపడమా – అంటూ అందరూ అతని అదృష్టానికి ఆశ్చర్యచకితులయ్యారు. పుల్లయ్యను సముద్రస్నానం చేయించింది అమ్మ. అమ్మ ప్రేమ పుష్కరిణిలో స్నానం చేశానని అతడు మహదానందపడ్డాడు. సముద్రానికి అడ్డు కట్టలు లేవు; అమ్మ మధుర మాతృప్రేమకీ అంతే.

తర్వాత కొద్ది రోజులకే పుల్లయ్య కన్నుమూశాడు. తన దగ్గర వందల మంది బిడ్డలు దర్శనం కోసం, చల్లని ఆ చూపు, స్పర్శకోసం తహతహలాడుతూంటే; ఆ తల్లి హృదయం ఎక్కడో మారుమూల అవిటి బిడ్డ కోసం తపిస్తోంది.

ప్రేమ, ఆదరణలకి నిలువెత్తురూపం ఆ తల్లి హృదయం కాదా!



# 25. అమ్మకే అమ్మయైన వరాహం

బాపట్లలో అమ్మ చిన తాతగారైన చిదంబరరావుగారింట్లో అమ్మకు ఆరు సంవత్సరముల వయస్సులో కొంతకాలం ఉంది. అక్కడ ఉన్న రోజులలో అమ్మ బాదం ఆకులో అన్నం పెట్టించుకుని వెళ్లి ఒక పందికి పెడుతూ ఉండేది. ఒకరోజు అది అన్నం తినకుండా అమ్మను ఆనుకుని పడుకుంది. అమ్మ ఆ పంది వెన్నురాస్తూ అరచేతిలో అన్నం పెట్టుకుని దానికి తినిపిస్తూ ఉంటే అది హాయిగా నిద్రపోతుంది.

ఆ పందికి తొమ్మిది పిల్లలున్నాయి. అందులో నాలుగు పిల్లలు పాలు త్రాగుతూ ఉండగా తక్కిన రొమ్ములు పాలతో చేపుకుని ఉంటాయి. అది చూచిన అమ్మ ఒక చిన్న గ్లాసు తీసుకొని రెండు రొమ్ములు పిండుతుంది. ఆ పాలు అమ్మ త్రాగబోతుంటే పంది కళ్లు తెరిచి తన పాలు తీసుకొమ్మన్నట్లుగా అమ్మవైపు చూస్తుంది. వెంటనే ఆ పంది రొమ్ముల్లోకి నోరుపెట్టి ఈ రొమ్మున ఒక గుటక ఆ రొమ్మున ఒక గుటక వేస్తుంది.

మనం ఏహ్యాభావంతో చూచేవరాహానికి బిడ్డయై దానికి మాతృస్థానాన్ని కల్పించింది అమ్మ. అమ్మకే అమ్మయైన ఆ వరాహం జన్మధన్యమయింది.





# 26. అమ్మ సన్నిధిలో జంతువులు కూడా నియమాలు పాటించుతాయి

ఒకరోజు జిల్లెళ్ళమూడిలో సో॥లు కామరాజు, ఐ.రామకృష్ణ, వి.ధర్మసూరి గార్లు కాంటిన్ వద్ద బజ్జీలు తింటున్నారు. సమీపంలో ఉన్న కుక్క వద్దకు ఒక బజ్జీ విసిరివేశారు. కానీ అది తినలేదు. తింటుందేమోనని మూతి దగ్గరగా ఆ బజ్జీని పెట్టారు. అది కదలలేదు, తినలేదు.

"కుక్కలు కూడా తినని బజ్జీలు మనం తింటున్నామా!" అని ఛలోక్తిని విసరి అక్కడ నుంచి వెళ్ళిపోయారు. నేరుగా అమ్మ దగ్గరికి వెళ్ళి మౌనంగా కూర్చున్నారు.

ఉన్నట్టుండి అమ్మ, "ఇక్కడ కుక్కలు కూడా నియమం పెట్టుకుని ఆనాడు ఏమీ తినవు, నాన్నా!" అన్నది. ఆ సంగతి విని వాళ్ళు ఆశ్చర్యపోయారు. తమ అజ్ఞానానికి చిన్న బుచ్చుకున్నారు.

నోరులేని ఆ జంతువులకి ఆ రోజు ఏకాదశి అనో శనివారం అనో ఉపవాసం చేయాలనో ఎలా తెలుస్తుంది ? మహాత్ములసన్నిధిలో ఏదైనా సాధ్యమే.





# 27. తల్లి సేవలో బిడ్డ - బిడ్డ సేవలో తల్లి

అనుక్షణం అమ్మసేవలోను, అమ్మ బిడ్డలసేవలోను, నిమగ్నమై ఉండే ఒక కుక్క నిత్యం అమ్మ సన్నిధికి వచ్చేది. అది అనేక సందర్భాలలో అమ్మకు అంగరక్షకుడుగా నిలచింది. దానిచూపులో, నడకలో, నడతలో, ఏ క్షణంలోనైనా ఆత్మార్పణం చెయ్యగల త్యాగం ధైర్యం కనిపిస్తుండేవి.

ఆ కుక్క అనారోగ్యంగా ఉందని, అవసానదశకు చేరుకుందని తెలుసుకున్న అమ్మ ఆ కుక్క దగ్గరకు బయలుదేరుతుంది. అక్కడున్న సోదరులు 'త్రోవ అంతా బురదగా ఉంది. అసలే ! రేగడినేల. నీవు ఆ బురదలో వెళ్లలేవు, దానినే ఇక్కడకు తీసుకొస్తాం" అంటూ ఎంతగా నచ్చచెప్పినా, ప్రయోజనం లేకపోయింది.

"ఈ వర్షం, బురద, నాకేం కొత్తగాదు. వీటికి అలవాటు పడ్డదాన్నే. పాపం పిచ్చిది ! దానికి నేనంటే ఎంత ప్రేమో! దానికి ఓపిక ఉన్నన్నాళ్లు, నా కోసం వచ్చేది. ఇవాళ దాని కోసం నేను వెళతాను. నాకేం ఫరవాలేదు. నేను వెళ్లాల్సిందే. మీరు దానిని ఇక్కడకు తీసుకువచ్చేది నాకోసం గాని, దాని కోసం కాదుగా" అంటూ అంతిమదర్శనానికి ఎదురు చూస్తున్న ఆ కుక్క దగ్గరకు వెళుతుంది.

అమ్మ వెళ్ళిన సమయానికి ఒక సోదరి గిన్నెలో పాలుపోసి ఆ కుక్కకు పాలు త్రాగిస్తుంటే అతికష్టం మీద గుటకలు వేస్తూ, మ్రింగుతుంది.

గ్లాసులో మిగిలిన కొద్దిపాలల్లో తులసి దళాలు తెప్పించి, ఆ పాలల్లో వేసి, కుక్క ప్రక్కనే కూర్చొని, దాని మీద చెయ్యివేసి, ఆప్యాయంగా నిమురుతూ, పాలు పట్టించింది. తరువాత దాని మూతికడిగి, శరీరం అంతా నీళ్లు చల్లి తోకవైపు భాగం అంతా తుడిచి కురుపు ఎక్కడా ఉంది? అంటూ చెవి పట్టుకుని చూచింది. అది బాధతో మూల్గింది. మళ్ళీ ఒకసారి నీళ్లు చల్లి, చెవి అంతా కడిగి, ఒళ్ళంతా నిమిరింది.

అమ్మ కరస్పర్శతో ఆకుక్కలోని అణువణువు ఆనందంతో పులకించింది. ఆ మరుసటిరోజునే అది అంతిమశ్వాస విడిచింది. దాని సేవాతత్పరతకు అమ్మ కైవల్యాన్నే ప్రసాదించింది.



# 28. ఆంజనేయస్వామి ఆలయం

ఒకసారి ఆవరణలోకి పెద్దకోతి వచ్చింది. ఆవరణంతా తిరిగేది. ఎవరినీ ఏమి చేసేది కాదు. రోజూ అమ్మ గదిలోకి వెళ్ళి ఎదురుగా కూర్చుని అమ్మను తదేకంగా చూచేది. అమ్మ ఇచ్చే పండో ఫలమో తీసికొని వెళ్ళిపోయేది.

ఒకసారి దానికి అస్వస్థత కలిగింది. అమ్మ హోమియో వైద్యుని రప్పించి అరటిపండులో మందు వేయించి, దానిచే తినిపించింది. దానికి స్వస్థత చేకూరి, మామూలుగా ఆవరణంతా తిరిగింది.

ఒకసారి పిల్లలు దానిని రాళ్ళతో బలంగా కొట్టారు. ఫలితంగా అది మరణయాతనని అనుభవించింది. దానిని చూచిన అమ్మ బాధతో విలవిలలాడింది. దానిపై పెద్ద గంప బోర్లించి, ఎన్నో జాగ్రత్తలు తీసికున్నది, వైద్యం చేయించింది. కానీ ఫలితం లేకపోయింది, అంతిమశ్వాస విడిచింది.

కోతి మరణవార్త వినగానే అమ్మ బొట బొటా కన్నీరు కార్చింది. అమ్మకు 'నీ-నా'భేదం ఉండదు. నరులైనా, వానరులైనా అందరూ తన రక్తం పంచుకుని పుట్టిన బిడ్డలే.

అమ్మ ఆదేశం మేరకు ఆ కోతి మృతదేహాన్ని పసుపు కుంకుమలతో పూజించి, బండిమీద ఊరేగించి, తీసికొని వెళ్ళి సమాధి చేశారు.

అమ్మ మాట ప్రకారం ఆసమాధి దగ్గర ఆంజనేయస్వామి విగ్రహ ప్రతిష్ఠ చేశారు నేడు. ఆలయం నిర్మించారు.

అదే ఆంజనేయస్వామి వారి ఆలయం.

అది అమ్మ మమకార గర్భాలయం.



# 29. అమ్మకు ప్రతిప్రాణీ ముద్దు బిడ్డే

ఒకసారి అమ్మ పూరిపాకలో మంచము మీద కూర్చుని ఉండగా - ఒక పంది కొక్కు వచ్చి అమ్మ పమిటి చెంగు పట్టుకొన్నది. అమ్మకు ఈ సృష్టిలో ప్రతి ప్రాణి ముద్దుబిడ్డగానే తోస్తుంది గనుక తన బిడ్డకు యేదో బాధకలిగిందని తోచి ఓదార్పు అవసరము అనుకుని కష్టంలో ఉన్న బిడ్డను తల్లి అనుసరించినట్లుగా ఆ పందికొక్కు వెంట అమ్మ బయలుదేరింది.

అది ఆ యింటికి దగ్గరలో ఉన్న ఒక బొరియ దగ్గరకు తీసుకెళ్లింది. అక్కడ ఒక మగపంది కొక్కు ప్రాణం లేకుండా పడి ఉన్నది. అది చూచిన అమ్మకు ప్రాణం విలవిలలాడింది. తనతో వచ్చిన ఆ పందికొక్కు వీపును ఆప్యాయతతో నిమరడం ప్రారంభించింది. ఆ కర స్పర్శలో ఏమి స్వాంతన కలిగిందో తెలియదుగాని బొరియలోనికి వెళ్ళిపోయింది ఆ పంది కొక్కు.



కష్టంలో ఉన్న వారిని చూసి
స్పందించగలిగేదే మానవత్వం
- అమ్మ

# ౩౦. అమ్మకి ఆనందం

అమ్మ సన్నిధిలో ఒకసారి కాకులు 'కావ్ - కావ్' మంటుంటే అక్కడున్న వసుంధరతో కావ్ కావ్ మనే వాటి అరుపులో నాకు 'కాపాడు - కాపాడు' అన్నట్లుగా వినిపిస్తుంది; వాటికి నేతితో గారెలు చేసి పెట్టమంది. అందుకు వసుంధర అక్కయ్య 'వాటికి నేతితోనా!' అని ఆశ్చర్యంగా అన్నది. "వాటికి నేతితో ఎవరు చేసి పెడతారు? అవి చాలా యిష్టంగా తింటాయి" అన్నది అమ్మ. తరువాత నేతితో తయారు చేసిన గారెలు అక్కయ్య తీసుకొస్తే వాటిని ముక్కలు ముక్కలుగా చేసి ఒక్కొక్క ముక్క అమ్మ పైకి ఎగురువేస్తుంటే గాలిలో ఎగిరే ఆ గారెముక్కలను క్రిందపడకుండా కాకులు ముక్కుతో పట్టుకొని తింటుంటే ఆదృశ్యాన్ని చూచిన అమ్మ ఎంతో పరవశురాలై ఆనందంతో కేరింతలు కొట్టింది. అమ్మ పొందిన ఆనందం అంతా ఇంతా కాదు.

మాటలు రాని పశుపక్ష్యాదులూ అమ్మ ఒడిలో పసిబిడ్డలే.



అడిగితే పెట్టేది అమ్మకాదు
అడగకుండా పెట్టేదే అమ్మ

\- అమ్మ

# 31. పక్షుల ప్రణయ కలహం

అమ్మ నివసించే యింటి పిట్టగోడ మీద రెండు కాకులు కూర్చుని ఉన్నాయి. అందులో ఒక కాకి దగ్గరకు వస్తే, రెండోది దూరంగా జరుగుతుంది. ఒకటి ఇటు ఎగిరి కూర్చుంటే, రెండోది అటు ఎగిరి కూర్చుంటుంది. అమ్మ అలవోకగా చిరునవ్వుతో వాటిని చూస్తూ అక్కడున్న సోదరుడు ఐ.రామకృష్ణకు చూపిస్తూ "ఇది మగకాకి - అది ఆడకాకి. ఆడకాకి అలిగింది. దానిని ఒప్పించాలని దీని ప్రయత్నం" అంటూ వాటి ప్రణయకలహాన్ని వివరించింది. మూడు నాలుగు నిమిషాలు మౌనంగా ఉన్న తరువాత "ఆ! ఇప్పుడు సయోధ్య కుదిరింది" అన్నది. అన్న మరుక్షణం ఆ రెండు కాకులు కలసి ఎగిరిపోయాయి.

సహజంగా సాటి మనిషి మనస్సే అర్థంకాదు. పశుపక్ష్యాదుల కదలికలు, మనస్సు ఎవరికి అర్థం అవుతాయి? అన్నింటికి అమ్మ అయిన అమ్మకు తప్ప.





## 32. "ఉండరా,నాన్నా! దాని ఆనందం ఏమిటో!!"

ఒకసారి సో॥ఐ.రామకృష్ణ అమ్మ వద్దకు వెళ్ళారు. వాతావరణం చల్లగా హాయిగా ఉంది. అమ్మ దివ్యమంగళ విగ్రహాన్ని తనివి తీరా చూస్తూ కూర్చున్నారు.

ఆ సమయంలో అమ్మ బుగ్గమీద ఒక ఆకుపచ్చని పురుగు పాకుతూ ఉండటం గమనించారు. అమ్మ మాత్రం నిశ్చలంగా అలాగే కూర్చుని ఉంది. రామకృష్ణ ఆ పురుగును తీసిపారవేద్దామనే ఉద్దేశంతో ముందుకు ఒంగి ఆ ప్రయత్నంలో ఉన్నారు. వెంటనే అమ్మ, రామకృష్ణ చేతిని గట్టిగా పట్టుకొని "ఉండరా, నాన్నా! దాని ఆనందం ఏమిటో!!" అని అన్నది.

పురుగే చాలా చిన్నది. ఇంకా దానికొక మనస్సు; ఆ మనస్సులో ఏదో దాగి ఉన్నది. దానిని గ్రహించింది అందరమ్మ. ఆ చిన్న జీవి మీద కూడా అమ్మకి ఎంత వాత్సల్యమో – అని ఆశ్చర్యాన్నీ, ఆనందాన్నీ పొందాడు ఆ సోదరుడు.

సాధారణంగా మన వంటి మీద పురుగు పాకితేనే మనకు కంపరంగా ఉంటుంది. దానిని చూస్తేనే జుగుప్స కలిగి ఒళ్ళు జలదరిస్తుంది. సకలప్రాణి కోటికీ అమ్మ కనుకనే అమ్మ ఆ పురుగును కూడా కన్నబిడ్డగా ఎంచింది. "ఉండరా, నాన్నా! దాని ఆనందం ఏమిటో" అని అన్నది అమ్మ.



అసలైన అమ్మకు
ఎవరిని చూసినా బిడ్డే అనిపిస్తుంది.

– అమ్మ

## 33. నిండు గర్భిణిగా ఉన్న కొబ్బరిచెట్టు

ఈ సృష్టిలో సకల జీవరాసులూ అమ్మ సంతానమే. అమ్మ జీవితచరిత్రను పరిశీలిస్తే అందులో గల అనేక సంఘటనల ద్వారా మనం ఈ విషయాన్ని గ్రహించవచ్చు.

అమ్మ ఒకసారి కృష్ణాజిల్లా నందిగామ వెళ్లినపుడు ఒకసోదరుని ఇంటికి వెళ్ళింది. అందరినీ ఆప్యాయంగా పలకరిస్తూ ఇంట్లోకి వెడుతూండగా ఒక కొబ్బరిచెట్టు కనిపించింది. అమ్మ అక్కడ నిలబడిపోయింది. చెట్టు నిండా బొండాలు ఉన్నాయి. కానీ చెట్టు మొదట్లో ముళ్లు, గుడ్డముక్కలు, పులివిస్తరాకులు చీదరగా పడి ఉన్నాయి.

అమ్మ గుండె కలుక్కుమన్నది. "చెట్లు కూడా మన పిల్లలే కదా, నాన్నా! నిండు గర్భిణిగా ఉన్న చెట్టును చూచే విధానం యిదేనా?" అంటూ ఒక కుర్చీ తెప్పించుకుని, అక్కడే కూర్చొని అప్పటికప్పుడు చెట్టు మొదలును శుభ్రం చేయించి, నాలుగు కడవల నీళ్లు పోయించింది.

"ఈ సృష్టి అనాది, నాది" అని ప్రకటించిన అమ్మకు ఈ సృష్టిలోని సమస్తము తన సంతానమేనని అనిపించి నందునే కాయలతో నిండుగా ఉన్న చెట్టు అమ్మకు నిండుగర్భిణిగా కనిపించినందునే, దానికి కావలసిన రక్షణ కల్పించింది.

అది ఒక్క అమ్మకి తప్ప అలా ఎవరికి అనిపిస్తుంది?



# 34. వరదాయిని అమ్మకు వరద కూడా బిడ్డే

ఎవరిని చూచినా తన బిడ్డే అనిపించడం అమ్మకు సహజం.

1977లో జిల్లెళ్ళమూడికి వరద వచ్చినపుడు ఊరంతా వరద నీటిలో మునిగిపోయి ఆశ్రమంలో కూడా వరదనీరు ప్రవేశించింది.

ఆందోళన చెందిన ఆశ్రమవాసులు, గ్రామస్థులు ఈ సంగతి అమ్మకి చెప్పగా అమ్మ ఆనందంతో, "అమ్మాయి ఇంటికి వచ్చిందా? ఆడపిల్లను ఊరికే పంపించకూడదు. పసుపు, కుంకుమ పెట్టి పంపించండి" అన్నది.

చీరె, రవికగుడ్డ, పసుపు- కుంకుమ, పూలు వరదనీటిలో వదిలారు. క్షణాల్లో వరద తిరుగుముఖం పట్టింది.

వరదాయిని అయిన అమ్మకు వరదకూడా బిడ్డే గదా!





# 35. భగవంతుడూ బిడ్డే

అమ్మ దృష్టిలో జడ చేతన భేదం లేదు. అంతా తన సంతానమే నంటుంది. ఈ విషయాన్నే తన జీవితంలో అనేక సంఘటనల ద్వారా మనకి తెలియజేసింది.

ఒకసారి అడవులదీవి నుండి ఒక సోదరుడు వేరుశెనగకాయలు ఒక న్యూస్‌పేపరులో పోసుకుని వచ్చి అమ్మ ముందు పెట్టాడు. వాటిలో నుండి ఒక్కొక్క కాయను కొడుతూ ఒకటి రెండు పప్పులు తాను తింటూ కబుర్లు చెపుతూ, నవ్వుతూ, నవ్విస్తూ చిన్న పిల్లలకు తినిపించినట్లుగా అక్కడున్న వారందరికీ నోటికి అందిస్తోంది అమ్మ. ఆ పేపరు మీద ఉన్న కాయలు క్రమంగా తగ్గిపోయాయి. ఆ పేపరు మీద ఒక ఫోటో కనిపించింది. వెంటనే అమ్మ, "ఇక్కడే ఉన్నావా! నాయనా" అంటూ ముద్దుగా పుత్రవాత్సల్యంతో చుట్టూ ఉన్న వాళ్ళకి పెట్టినట్లుగానే ఆ ఫోటోలో ఉన్న వ్యక్తి నోటికి అందిస్తూ పరవశించింది.

ఇంతకీ ఆ ఫోటోలో ఉన్నవారెవరు, అని చూస్తే భగవాన్ శ్రీ రమణ మహర్షులవారు.

భగవాన్ కూడా అమ్మకు బిడ్డేనా? అవును. ఏ శక్తి-

తన అవతరణకు పూర్వమే తాను ఏదో అదిగా ఉంటూ;

తన చుట్టూ జరుగుతున్నదానికి సాక్షిగా ఉంటూ;

అందరికీ చేరువలో ఉంటూ; వీటన్నింటినీ మించి – రూపుధరించిన మాతృమూర్తిగా దిగివచ్చిందో అదే 'అమ్మ'. కనుకనే మన కంటికి జడపదార్థంగా కనిపించే మహర్షి ఫోటోకి అమ్మ పప్పు తినిపించగలిగింది.

కనపడుతున్నది, కనపడనిది – రెంటినీ కలిపి బ్రహ్మ అని అన్నది అమ్మ. "కనపడుతున్నది సరే. మరి కనపడని దాని సంగతేమిటి? అంటే దారం లేకుండా దండ ఎక్కడ ఉంటుంది?" అని అన్నది అమ్మ.



# 37. "తల్లికి బిడ్డ సొమ్ము - బిడ్డకు డబ్బు సొమ్ము"

అమ్మకు నాలుగు సంవత్సరాల వయస్సులో బాపట్లలో ముత్తాయిపాలెం సముద్రం ఒడ్డుకు వెళ్ళింది. ఒంటి నిండా సొమ్ములున్నాయి. అక్కడున్న ఒక జాలరి చూచి ఒంటిమీద ఉన్న సొమ్ములన్ని ఒలిచి తీసుకుని తన నేరం బయటపడకుండా ఆ చిన్నపిల్లని అంతం చేయాలని సముద్రంలోకి విసరివేశాడు. సముద్రంలో ఒక మెరుపు వచ్చింది. సముద్రమంతా కాంతిగా ఉంది. ఆకాంతిలో అమ్మ కనిపించలేదు. సముద్రంలోని ఒక అల అమ్మను ఒడ్డుకు నెట్టుకు వచ్చి జాలరిని సముద్రం లోపలకు నెట్టివేసింది. సముద్రంలోకి జాలరి నెట్టివేయబడటంతో ఆ జాలరి ఉక్కిరి బిక్కిరి అయిపోయి ఊపిరాడక బాధపడుతున్న సమయంలో ఏవో రెండు చేతులు వాడినిపైకెత్తి, ఒడ్డుమీద పడేశాయి - ఏ పిల్లనయితే తాను సముద్రంలో పడేశాడో ఆ రూపమే తనను ఒడ్డుకు చేర్చినట్లు గమనించాడు.

అమ్మ ఒడ్డున కూర్చుని ఉంది. సముద్రంలో కనిపించిన కాంతి అమ్మ ముఖంలో కనిపించింది. పల్లెవాడు పశ్చాత్తాపంతో అమ్మను ఎత్తుకుని యింటికి తీసుకెళ్ళి అన్నం తినిపించాడు. అంతకు ముందు తాను ఒలిచిన సొమ్మంతా తిరిగి అమ్మ ఒంటికి పెడుతుంటే "నీవు ఒలిచింది నీ సొమ్మే. నీవు తిరిగివచ్చావు. అంతే చాలు. అది నీ సొమ్మే" అంటూ "తల్లికి బిడ్డసొమ్ము - బిడ్డకు డబ్బు సొమ్ము" అని ఓదార్చింది అమ్మ.



# 38. "సంఘమాత"

అమ్మకు అపుడు ఆరేళ్ల వయస్సు. తెనాలిలో తన తాతగారైన శ్రీ చంద్రమౌళి వెంకట సుబ్బారావు గారింట్లో ఉన్నది.

ఒక రోజు పారిశుధ్యం పనిచేసే ఒకామె రోడ్డు మీద కసువు చిమ్ముతూ బండిలో పోస్తుంది. బండి ముందు పోతూ ఉంటే బండి వెనుక ఆమె నడుస్తున్నది. ఆమె వెనుక తన మూడు సంవత్సరముల కుర్రవాడు పరిగెత్తుతున్నాడు. పరిగెత్తుతూ పరిగెత్తుతూ క్రిందపడిపోతాడు. ఆ సమయంలో అదే మార్గంలో రెండు గేదెలు పరిగెత్తుకుంటూ వస్తుంటాయి. ఇది చూచిన అమ్మ, పిల్లవాడు ప్రాణాప్రాయ స్థితిలో ఉన్నాడని గ్రహించి పరుగెత్తుకుంటూ వచ్చి పిల్లవాడిని లేవనెత్తి, భుజాన వేసుకుని యింటికి వస్తుంది. అక్కడే ఉన్న అమ్మకు అమ్మమ్మ అయిన జానకమ్మ గారు, అమ్మకు తాతగారైన వెంకట సుబ్బారావు గారు అయ్యో పాపం! అంటారే గాని, పిల్లవాడిని లేవతీయటానికి ముందుకురారు మైలపడతామేమో అనే భావంతో.

ఈలోపుగా ఆ పిల్లవాని తల్లి అక్కడకు వచ్చి అమ్మను చూచి కంటి వెంట నీరుకారుస్తూ, చెయ్యి చాచి అమ్మ భుజాన ఉన్న తన బిడ్డను ఎత్తుకోబోతే అమ్మ కంఠం గట్టిగా పట్టుకునివదలడు. పిల్లవాని తల్లి తనకు తెలియకుండానే అమ్మను వాటేసుకుని బావురుమని ఏడుస్తూ "బిడ్డకు తల్లిని నేను కాదమ్మా. నీవే అమ్మవు. నాకు కూడా నీవే అమ్మవు" అంటుంది.

'నా బిడ్డ చాలా అదృష్టవంతుడమ్మా. బ్రాహ్మలెత్తుకున్నారు' అంటూ ఆనందపడుతుంది. అక్కడే ఉన్న జానకమ్మగారు 'మా బ్రాహ్మణత్వం మంట కలసింది' అని అంటుంది. "అవును. బ్రాహ్మణత్వం మట్టిలో కలసింది గనుకనే బిడ్డను ఎత్తుకోటానికి రాలేదు. పాకీదంటే పనికిరానిదనా!" అని వారిని నిలదీసి, బ్రహ్మతత్త్వమే బ్రాహ్మణత్వమని కనువిప్పు కలిగించి ఆమె సంఘమాత అంటూ తన అక్కున చేర్చుకుంది అమ్మ.



# 39. ముక్తిప్రదాయిని

పూర్వం రోజులలో ఎక్కడికి వెళ్లాలన్నా ఎడ్లబండ్ల మీద గాని, గుఱ్ఱపు బండ్లమీద గాని వెళ్లవలసిందే. అమ్మ వయస్సు ఆరేళ్లు. ఒకసారి అమ్మ తన తాతగారింటికి వెళ్లటానికి తెనాలి రైల్వేస్టేషను ముందు నిలబడి ఉన్న ఒంటెద్దు బండి దగ్గరకు వచ్చి తాతగారి యింటి అడ్రసు చెబుతూ, "బండి ఎంతకు కడతావబ్బాయి" అంటూ ఎద్దుమీద చెయ్యి వేసి నిమురుతుంది. అమ్మ దాని మీద చెయ్యి పెట్టగానే ఎద్దు ఉలిక్కిపడి, గజగజా వణుకుతుంది.

'ఎద్దు జోలికి పోవద్దు' అని బండి అబ్బాయి చెబుతున్నా అమ్మ మాత్రం ఎద్దును నిమురుతూనే ఉంటుంది. "నీకు కాదా – చెప్పేది?' అంటూ కొరడా తీసుకుని ఒక దెబ్బ వేస్తాడు అమ్మను. ఆ కొరడా దెబ్బ అమ్మకు, ఎద్దుకు కూడా తగులుతుంది. ఎద్దు ఉలిక్కిపడి లేచి అమ్మ పాదాల మీద ముట్టె పెట్టి అమ్మ వంక చూస్తూ క్రింద పడిపోతుంది. బండివాడు అమ్మ పాదాల వంకా, ఎద్దు ముఖము వంకా చూస్తూ ఇదేమిటమ్మా, ఎద్దును బెదరగొట్టావు. అసలే చావుకు సిద్ధమైంది. వారం రోజులనాడు చచ్చిపోయిందనే అనుకున్నా. ఆశలు వదలుకుని ఎద్దుకు నయమయితే ఏమైనా ఇస్తాననే బదులు పొరపాటున ఎద్దునే యిస్తానని మొక్కుకున్నా. ఎద్దుకు మేతవేసి పడుకుని లేచేటప్పటికి మేత కొరుకుతుంది. ఎందుకు బ్రతికిందో బ్రతికింది. ఈ రోజే బండి కట్టాను" అని అమ్మతో అంటూ ఉండగానే ఎద్దు రెండు కళ్లు తెరిచి అమ్మ వంక చూచి 'అంబా' అని అరుస్తూ అమ్మ రెండు పాదాల మధ్య తలపెట్టి ప్రాణం వదలుతుంది.



# 40. వాత్సల్యామృతవర్షిణి

అమ్మ వయస్సు ఆరు సంవత్సరాలు. అప్పట్లో ఎక్కువగా తన తాతగారు శ్రీ చిదంబరరావుగారింట్లో ఉండేది.

ఒకరోజు వర్షం జోరుగా పడుతోంది. కొందరు బిచ్చగాళ్ళు వారింటి ముందున్న పంచలోకి వచ్చి అన్నపు జోలెలు పెట్టుకున్నారు. అది చూచిన చిదంబరరావుగారి భార్య 'జోలెలు తీసివెయ్యండి. ఎంగిలి మంగలం' అని కేకలు వేసింది. వాళ్ళు బిక్కు బిక్కు మంటూ జోలెలు చేతపట్టుకుని నిలుచున్నారు. ఇది చూచిన అమ్మ హృదయం ద్రవించింది.

వారి జోలెల్లో తడిసిన అన్నాన్ని కుక్కలకు, పందులకు పెట్టింది. వంట మనిషిని అడిగి వెచ్చని అన్నాన్ని కూరలు తెచ్చింది. తీసివేసిన సత్తుగిన్నెకు సున్నిపిండి మాటు పెట్టి తగినంత పులుసు పోయించి తెచ్చింది. నెయ్యివేసి ఇవన్నీ వారికి అందించింది.

చిదంబరరావు తాతగార్ని అడిగి వారి చొక్కాలు, ధోవతులు, తలగుడ్డలు, తనవి నాలుగు గౌనులు తెచ్చి వారి చేతిలో పెట్టింది. "ఎవరైనా చూస్తారు. వెంటనే వెళ్ళిపోండి" అని తొందర చేసింది.

ఆ బిచ్చగాళ్ళు కృతజ్ఞతతో మహదానందంతో, మా బంగారు తల్లి అంటూ వెళ్ళిపోతారు.

అంత చిన్న వయస్సులో అంత పెద్ద వయస్సు గల అనాధలను పుత్రవాత్సల్యంతో వాళ్ళ అవసరాలను తీర్చిన అమ్మ ఎవరు? వాత్సల్యామృతవర్షిణి.



# 41. ఆ రాముడే ఈ అమ్మ

అమ్మ తన ఏడవ ఏట తమ బంధువులైన చింతపల్లి రామచంద్రరావు గారింటికి గుంటూరు వెళ్ళింది. గుండేలురావుగారు వారి తమ్ముడు. ఆయన బ్రహ్మచారి, రామభక్తులు; పక్షవాతంతో 20 ఏళ్ళ నుండి బాధపడుతున్నారు. వారు బ్రహ్మచారి కావటం వలన వారి అన్నగారి ఇల్లే వారికి ఆశ్రయం అయింది. కానీ రామచంద్రరావుగారికి రెండవ వివాహం అయినందున రామచంద్రరావు గారి మీద శ్రద్ధే అంతంత మాత్రంగా ఉండేది.

వారి దీనావస్థ తనకు తెలిసినట్లు వాకిట్లో అమ్మ బండి దిగగానే సరాసరి గుండేలురావుగారి మంచం దగ్గరికి వెళ్ళింది. ఒక నారింజ పండు తీసి వారి చేతుల్లో పెట్టింది. 'ఒలుచుకోలేను' అన్నారాయన. అమ్మే వలిచి నోటికి అందించింది. మూత్రవిసర్జనతో దుర్వాసన వస్తోంది. ఆ గుడ్డల్ని తీసి శుభ్రమైన వస్త్రాల్ని పరిచింది. ఒళ్ళంతా తుడిచి శుభ్రం చేస్తుంది. పసివానికి కన్నతల్లి చేసినట్లు సేవలు చేస్తుంది.

అయాచితంగా అత్యంత అనురాగంతో అమ్మ చేసే ఉపచారాలకు వారి తనువు, మనస్సు చల్లబడ్డాయి. 'నా బాధ నివారణ చేయడానికి వచ్చావా నాయనా, రామచంద్రా' అంటూ పులకించిపోయారు. 'అమ్మై ఆదరిస్తోంది; రాముడై రక్షిస్తోంది' అని అన్నారు నంగి నంగి మాటలతో వారి అన్నగారితో.

గుంటూరులో ఉన్నంతకాలం అమ్మ ఎక్కువసేపు గుండేలురావుగారి సేవలోనే గడిపింది. అమ్మ అడుగుపెట్టిన మరుక్షణం నుంచీ వారు ఎంతో ఆనందాన్ని, హాయిని అనుభవించారు. తన నుండి ఏదో అమ్మలోకి చేరుతున్నట్లు; అమ్మ నుండి ఒక దివ్యశక్తి తనలోకి ప్రవేశిస్తున్నట్లుగా అనుభూతి పొందారు.

"అసాధారణం సాధారణమైన తత్త్వంగా వచ్చింది. మన ఎదుట నిల్చింది. నువ్వు ఈ అమ్మను నమ్ముకో. నా ఆరాధ్యదైవం రఘురాముడే ఈ అమ్మ" అన్నారు చివరి మాటలుగా తన అన్నగారితో.

ఆప్యాయంగా అమ్మ అందించే గోరుముద్దలను తనివితీరా స్వీకరిస్తూ అంతిమశ్వాసవిడిచారు.



# 42. విచక్షణ లేని వీక్షణ

అమ్మకు పదిహేనేళ్ల వయస్సు. కొత్తగా కాపరానికి వచ్చిన రోజులు. బాపట్ల రైల్వేస్టేషనుకు దగ్గరగా ఉన్న ఆస్పత్రి సమీపంలో ఉన్న కుళాయి దగ్గరకు మంచినీళ్ల కొరకు బిందె తీసుకుని రోజూ వస్తూ ఉండేది. ఒకరోజు ఆసుపత్రి గోడ ప్రక్క నుండి ఎవరో మూలుగుతున్నట్లుగా వినిపించింది. దగ్గరకు వెళ్లి అతను కప్పుకున్న ముసుకు మెల్లగా తీస్తుంది. జ్వరం మండి పోతూ ఉంటుంది. కళ్లు అంటుకుని పోయి, పుసులు కట్టి, నీళ్లు కారుతూ ఉంటాయి. అతని స్థితిని చూచి చలించి పోయిన అమ్మ స్వయంగా వెళ్లి డాక్టరును పిలుచుకువచ్చి, ఆస్పత్రిలో చేర్పించి, తన చీర పమిటి చెంగు చించి దుర్వాసనతో ఉన్న అతని శరీరాన్ని తడిగుడ్డతో తుడిచి, లేవతీసి, కూర్చునబెట్టి, తను ఆసరగా నిలబడి, తన వేళ్లతో పళ్లు తోమి, ముఖం కడుగుతుంది.

అది చూసిన డాక్టరు గారు చేతితో పట్టుకోబోకమ్మా! మన నోట్లో నీళ్లే మన చేతిలో పోసుకోకూడదు అని, ఎంతవద్దని వారిస్తున్నా, అమ్మ ఏ మాత్రం అరమరికలు లేని ఆదరణతో, కంపుకొడుతున్న అతనికి అన్ని పరిచర్యలు చేసింది. అతని మీద మమకారాన్ని చంపుకోలేక మంచినీళ్లకు వచ్చే నెపంతో ఇంట్లో వారికి తెలియకుండా అతనికి పథ్యం తెచ్చి, అన్నం కలిపి నోట్లో పెట్టింది. అతని కంటి వెంట అప్రయత్నంగా నీరు కారడం చూసిన అమ్మ ఎడమ చేతితో, అతని తల భుజం మీద ఆనించుకుని, ఎందుకు నాన్నా! గొంతు నొప్పిగా ఉందా! అంటుంది. ఇంకా పెద్దగా ఏడుస్తాడు. ఇదంతా చూస్తున్న డాక్టరుగారికి కూడా కళ్లనీళ్లు వస్తాయి. డాక్టరుగారు అతనిని వివరాలు అడిగినపుడు తనది మెదక్‌జిల్లా అని, తన పేరు 'రహి' అని, ఉర్దూలో చెపుతాడు.

డాక్టరుకే బ్రతుకుతాడని నమ్మకం లేని ఆ వ్యక్తి అమ్మ ఆదరణతో కోలుకోవటం చూచిన డాక్టరు గారు అమ్మతో ఒక అనాధకు, దిక్కులేనివానికి, దిక్కు నీవై, తల్లికంటె ఎక్కువగా సేవచేసావు అంటాడు. నిజానికి ఈ విచక్షణ లేని వీక్షణ తల్లికి తప్ప ఎవరికుంటుంది ? ఆ తరువాత 'రహి' జీవితం అమ్మ సేవకే అంకితం అవుతుంది. రహి ఒక సిద్ధపురుషుడు.



# 43. అవసరమే విలువైనది

ఒకరోజున ఒక ముసలమ్మ వర్షంలో తడిసి అమ్మ వద్దకు వచ్చింది. కట్టుకున్న చీరె నీళ్లు కారుతున్నది. ఆమె చలికి గజగజ వణుకుచున్నది. అమ్మ ఆమెను చూడగానే రామకృష్ణఅన్నయ్యతో వసుంధర నడిగి చీరె తీసుకురమ్మన్నది. లోపలికి వచ్చి అడిగాడు. బీరువా తీసి చూపించి "ఒక్కటే చీరె ఉన్నది, ఇపుడు అమ్మస్నానానికి వస్తే కావాలి కదా!" అన్నది వసుంధర అక్కయ్య. రామకృష్ణ అన్నయ్య వెళ్ళి ఆ విషయం అమ్మకు చెప్పాడు.

అమ్మ వెంటనే చివాలున లేచి పాదరక్షలైనా వేసుకోకుండా లోపలికి వచ్చి స్వయంగా బీరువా తెరచి అందులో ఉన్న ఖరీదైన పట్టుచీరెను ముసలమ్మకు యివ్వటానికి బయలుదేరింది. అది చూచిన వసుంధర అక్కయ్య "ఆ చీరె ఒక్కటే ఉన్నదమ్మా! ఆ చీరె యిస్తే నువ్వు యిపుడు స్నానానికి వస్తే కట్టుకోను చీరె లేదమ్మా!" అనగా అమ్మ మందస్మితయై "నాకు చీరె ఉండదని ఆలోచిస్తున్నావా! నాకు అవసరమైతే అదే వస్తుంది. అదీ కాక మనం యిస్తేగాని మనకు కొత్తవి రావు" అంటూ వణికి పోతున్న ముసలమ్మకు చీర యివ్వగానే అందుకున్న ఆమె కళ్లల్లో ఆనందం వెల్లి విరిసింది. అమ్మ ప్రేమకు పొంగిపోయి అమ్మ పాదాలను ఆనందబాష్పాలతో నింపివేసింది.

తరువాత అమ్మ స్నానానికి రాగా 'ఇప్పుడు చీర ఎట్లా?' అని వసుంధర అక్కయ్య అనుకుంటున్న సమయంలో అమ్మ దర్శనం కొరకు వచ్చిన ఒక కుటుంబం అమ్మకు చీరె తెచ్చారు. 'దర్శనం సమయంలో యిస్తే ఆ చీరె తిరిగి మాకు ఇచ్చేస్తుంది. ఇది అమ్మ కట్టుకోవాలని తెచ్చాం' అంటూ వసుంధర అక్కయ్య చేతికి ఆ చీరె యిచ్చారు. అక్కయ్య ఆశ్చర్యపోయింది.

"అవసరమైతే అదే వస్తుంది. చీరె లేదని ఆలోచించవద్దు" అని అక్కయ్యతో అమ్మ అన్నమాటకు ఇంతకంటె నిదర్శనం ఏం కావాలి?

అనుక్షణం బిడ్డల అవసరాల్ని గురించి ఆలోచించే అమ్మ చలికి గజగజ వణికే ముసలమ్మకు పట్టుచీరె యివ్వడంలో ఆశ్చర్యమేముంది?



# 44. పరవశించిన పారిశుద్ధ్యపు పనివారు

అమ్మ వాత్సల్యయాత్రలో భాగంగా 1973 నవంబరు 5న ఏలూరు వచ్చినప్పుడు పారిశుద్ధ్యపు పనివారి కాలనీకి వస్తున్నట్లు తెలుసుకున్న ఆ కాలనీ వాసుల ఆనందానికి అవధులు లేవు. క్షణాల మీద వీధి అంతా శుభ్రం చేసికొని ముగ్గులు పెట్టుకున్నారు. అంతేకాదు. అమ్మకు నివేదన చెయ్యటానికి ప్రసాదాలు కూడా కొందరు సిద్ధం చేసుకున్నారు.

అమ్మ రాగానే ఎదురుగా వచ్చి ముకుళిత హస్తములతో స్వాగతం పలికారు. అందరూ ఇండ్లలో నుండి వెలుపలకు వచ్చారు. కరుణారస స్వరూపిణి అయిన అమ్మను చూడగానే ఏదో తెలియని ఒక దివ్యానుభూతికి లోనై పరుగు పరుగున వచ్చి అమ్మను ఆలింగనం చేసుకున్నవాళ్ళు కొందరైతే; పూలదండలు వేసి పాదాభివందనం చేసుకొన్నవారు మరికొందరు.

అమ్మ వారిని పుత్రవాత్సల్యంతో హృదయానికి హత్తుకుంటూ ఉంటే చూచేవారికి ఇది ఎన్ని జన్మల బంధమో అనిపించింది.

వారి పూజలనందుకున్న అమ్మ తన అనుగ్రహ దృక్కులను ప్రసరింపచేస్తూ ఆ ప్రాంతం అంతా సంచరించింది. అమ్మ ప్రేమకు పరవసించిన వారందరూ ఆనందాశ్రువులతో అమ్మకు వీడ్కోలు పలికారు.



**అమ్మ మమకారం అపారం, అవ్యాజం, అపరిమితం.**
**అమ్మ అంటే అంతులేనిది, అడ్డులేనిది,**
**ఆధారభూతమైంది.**

# 45. మనవాళ్ళంటే

1975లో అమ్మ నెల్లూరు వెళ్ళింది. ఎంతో మంది అమ్మను దర్శించుకుని ఆనందించారు. ఆ సందర్భంగా అమ్మ సో॥ పరబ్రహ్మమూర్తిని పిలిచి, "ఒరేయ్! ఇక్కడ మనవాళ్ళు ఎంతమంది ఉన్నారో కనుక్కో" అన్నది.

అమ్మతో వచ్చిన పరిజనం – సోదరీ సోదర బృందాన్ని దృష్టిలో పెట్టుకొని "50 మంది ఉంటారమ్మా" అని అన్నాడు ఆ సోదరుడు.

తక్షణం అమ్మ తడుముకోకుండా, "మన వాళ్ళంటే వీళ్ళు కాదురా. ఫుట్‌పాత్ మీద భిక్షాటన చేసేవారూ, వీధి వీధి తిరుగుతూ భిక్షాటన చేసేవారూ, మురికివాడలలో ఉంటూ తిండికి, బట్టకు బాధపడేవారూ – వాళ్ళూ – మన వాళ్ళు అంటే. వాళ్ళు ఎంతమంది ఉన్నారో కనుక్కో. వాళ్ళందరికీ దధ్యోదనం, పులిహోర పెట్టుకోవాలని ఉంది" అన్నది అమ్మ.





## 46. నక్సలైట్లూ నా బిడ్డలే

అమ్మ తనను హత్య చెయ్యటానికి వచ్చినవారిని, దొంగతనం చెయ్యటానికి వచ్చినవారిని కూడా ఆదరించి అన్నం పెట్టిన సంఘటనలు అనేకం ఉన్నాయి.

1975 డిసెంబరు 30వ తేది అర్ధరాత్రి జిల్లెళ్ళమూడిలోని అందరింటి పైన, హైమాలయంపైన నక్సలైట్లు దాడి చేసి నగలు దోచుకుని భీభత్సాన్ని సృష్టించారు.

తన ప్రాణాన్ని కూడా పణంగా పెట్టి అమ్మకు రక్షకకవచంలాగా నిలబడ్డ గోపాలన్నయ్య పరుగున అమ్మ దగ్గరకు వెళ్ళి – 'అమ్మా ! బీరువాలో ఉన్న నీ సొమ్ము అంతా నేను చూస్తూ ఉండగానే దోచుకుపోయారు' అని అన్నయ్య దుఃఖిస్తుంటే, "సొమ్ముపోతే పోయింది. నా బిడ్డ నాకు దక్కాడు" అని సంతోషించింది అమ్మ.

తరువాత పోలీసువారు నక్సలైట్లను బంధించి అమ్మ వద్దకు తీసుకువచ్చారు. అపుడు అమ్మ "ముందు వాళ్ల భోజనం సంగతి చూడండి. ఆలస్యం అయితే టిఫెను పెట్టించండి. కొందరు పిల్లలు అడిగి తీసుకుంటారు; కొందరు అడగకుండానే తీసుకుంటారు; కొందరు బెదిరించి తీసుకుంటారు. వీళ్లు ఆ కోవకు చెందినవాళ్ళు" అని అన్నది అమ్మ పుత్రవాత్సల్యంతో.



రావణాసురుడు దుర్మార్గుడనీ,
లోక కంటకుడనీ, తల్లి ప్రేమించకుండా ఉంటుందా?
ఆ స్థానం అట్లాంటిది.. – అమ్మ

# 47. అమ్మ అనురాగం

'నీ పుట్టినరోజుకి ప్రతిసారీ నా దగ్గరకు రా, నాన్నా!' అని అమ్మ కోరింది. అమ్మ కనుకనే కోరింది.

నా పుట్టినరోజు సందర్భంగా 17.7.75 సాయంత్రానికి జిల్లెళ్ళమూడి చేరాను. ఆవరణలో జనం గుంపులు గుంపులుగా చేరి ఉన్నారు; వారి ముఖాల్లో ఆందోళన స్పష్టంగా కనిపిస్తోంది. అందుకు కారణం తెలుసుకునే ప్రయత్నంలో ఉన్నాను. నేను వచ్చి ఐదునిమిషాలైనా కాలేదు. 'అప్పారావు అన్నయ్యను అమ్మ పిలుస్తోంది' అనే కబురు వచ్చింది.

వెంటనే అమ్మ గది వద్దకు వెళ్ళాను. అక్కడా ఆందోళనకరవాతావరణమే. విషయ ఏమంటే - అమ్మ చట్టమీద పెద్దగడ్డ లేచి తనను విపరీతంగా బాధిస్తోంది. అయినా విశ్రాంతి లేకుండా దర్శనాలు ఇస్తున్నది, సంభాషిస్తున్నది. గడ్డకు ఆపరేషన్ చేసి అమ్మను వైద్యం నిమిత్తం, విశ్రాంతి నిమిత్తం తమ ఇంటికి తీసికొని వెళ్ళాలని నెల్లూరు నుంచి డాక్టర్ సుబ్బారావు గారు వచ్చారు.

నాడు ఆపరేషన్ చేయటానికి అమ్మ అంగీకరించ లేదు. "రేపు అప్పారావు వస్తాడు. రేపు వాడి పుట్టినరోజు. నేను లేకపోతే వాడు ఏడుస్తాడు" అని అన్నదట. తన బాధను ప్రక్కన పెట్టి, బిడ్డ సంతోషానికే విలువనిచ్చే అమ్మ త్యాగనిరతకి నేను వెక్కి వెక్కి ఏడ్చాను.

అమ్మ నన్ను దగ్గరకు తీసుకుని తలకు నూనె రాసి, నుదుటబొట్టుపెట్టి, తలపై పూలు వేసి, తల నిమురుతూ, "నాన్నా ఈ రోజున నీపుట్టినరోజు" అన్నది. అమ్మ అనురాగవర్షానికి నా కన్నులు జలజలా ప్రవించాయి.





# 48. అమ్మ అందించిన మహోపదేశం

**వృత్తి-ప్రవృత్తి:** 1977లో నేను ఏలూరులో ఉంటూ ఉండేవాడిని. వృత్తిరీత్యా హోల్‌సేల్ వేరుశనగనూనె వ్యాపారం. అదీ అమ్మ శ్రీకారం చుట్టినదే. నియమబద్ధమైన ఆధ్యాత్మిక జీవితం గడుపుతూ అనుక్షణం అమ్మను స్మరిస్తూ జీవితంలో ప్రతిఘట్టంలోను అమ్మ సూక్తులను సమన్వయం చేసుకుంటూ అంతటా మాతృతత్త్వాన్ని దర్శించాలనేదే నా తపన. నా ధ్యేయం.

**శరణాగతి :** కష్టమైనా సుఖమైనా అన్నీ అమ్మ అనుగ్రహమేననీ; ఇవ్వబడిన సర్వమూ వరమేననీ; ఒడి దుడుకులు కూడా అమ్మ అనుగ్రహమేనని; అనుభవానికి తెచ్చుకోవటానికి అమ్మను ఆశ్రయించిన శరణాగతుణ్ణి.

బిడ్డలకు ఒడిదుడుకులు వచ్చినపుడు వారిని అమ్మ ఎలా కాపాడుతుందో; వారికి అమ్మతత్త్వాన్ని ఎలా రంగరించి పోస్తుందో; వారిని ఉన్నత భూమికలకు ఎలా తీసికెళుతుందో తెలియజేసే నా జీవితంలోని సంఘటనను తెలియజేస్తాను.

**ఉపదేశం :** 1977 జూన్‌లో రూ. 70,000/-లు కిమ్మత్తుగల ఒక లారీ వేరుశెననూనె ఎమ్మిగనూరులో కొనుగోలు చేశాను. కానీ అది నాకు సకాలంలో చేరకపోయేసరికి తలక్రిందులయ్యాను. అప్పట్లో నా ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రమే.

దిక్కుతోచక అమ్మకు ఫోను చేశాను. గాద్గదికమైన కంఠంతో 'నా లారీ సరుకు పోయిందమ్మా' అన్నాను. "నాకు తెలుసు, నాన్నా! వాడెన్ని బాధలలో ఉన్నాడో! నీ కంటె వాడే ఎక్కువ బాధలలో ఉన్నాడు, నాన్నా!" అన్నది. నా లారీ సరుకు అపహరించిన వాని మీద సానుభూతి చూపిస్తున్నది. 'ఇప్పుడు నన్ను ఏం చెయ్యమంటావు, అమ్మా' అని అడిగాను. అందుకు సమాధానంగా **"నువ్వు చేసేదేముంది? జరిగేది జరుగుతుంది. చూస్తూ ఉండు నాన్నా!"** అన్నది. 'అమ్మను ఆశ్రయించినందులకు ఈ ఉదాసీనమా ప్రతిఫలం? అని తాత్కాలికంగా అమ్మ మీద కోపం వచ్చింది. కానీ అవి ఉపదేశవాక్యాలై నా జీవిత విధానాన్నే మార్చివేశాయి.

అమ్మ నన్ను చూస్తూ ఉండమన్నది; కానీ తాను చూస్తూ ఉండలేదు; అపహరించిన వ్యక్తి బెహరాను వెంటాడింది. ఒక శక్తి తనను వెంటాడుతున్నట్లుగా అతనికి అనుభవం కలిగిందట. అతనికి ఊపరి ఆడక వచ్చి తన నేరాన్ని అంగీకరించి పశ్చాత్తాపంతో సొమ్ముకు బదులు తన లారీని ఇస్తానని మాట ఇచ్చాడు. తన బాధ అంతా వివరించాడు. బంధువులెవరూ వానిని పట్టించుకోలేదు.

భార్య, బిడ్డా అనాధలు కాకుండా తనను రక్షించమని కన్నీరు కార్చాడు, కాళ్ళవేళ్లా పడ్డాడు. ఆ సమయంలో అతనిని పోలీసులు పట్టి జైలులో పెట్టారు. 'నీకంటే వాడే ఎక్కువ బాధలలో ఉన్నాడు" అన్న అమ్మ మాట నాకు అర్థమైంది. ఆ గజదొంగ మీద సోదరభావం కలిగింది. అదే స్థితిలో నా సోదరుడుంటే ఏం చేస్తాను? అనుకొని నేనే జామీను ఇచ్చి విడిపించాను. పుణ్యక్షేత్రాలు చూపించాను. నా ప్రమేయం లేకుండానే నాలో ఈ సంస్కారాన్ని కలిగించింది అమ్మ.

"జరిగేది జరుగుతుంది. హాయిగా చూస్తూ ఉండు" అనే అమ్మ వాక్యం నాకు ఉపదేశవాక్యమైంది. ఆ క్షణం నుంచీ 'నా చేతిలో ఏమీ లేదు; దీనికి కర్త ఎవరో ఉన్నారు. వాని ఇష్ట ప్రకారమే జరుగుతోంది' అనే భావం ఆరంభమైంది. అంటే కర్తృత్వభావన పోయి కర్తవ్య భావన చోటు చేసుకుంది. అన్నింటినీ సాక్షీమాత్రంగా గమనించడం ప్రారంభమైంది.

రూ. 2,000/-లు జరిమానా విధించి బెహరాను విడుదల చేయడానికి కోర్టు అంగీకరించింది. ఆ సొమ్ము నేనే చెల్లించి అతడ్ని విముక్తుడ్ని చేశాను. వెంటనే అమ్మ దర్శనం చేయించమని ప్రాధేయపడ్డాడు. తక్షణం బయలుదేరి అమ్మ సన్నిధికి చేరుకున్నాం. అమ్మ దర్శన స్పర్శనాదులచే అతని రాతి గుండె కరిగి కన్నులు అశ్రుధారలు వర్షించాయి. అమ్మ ప్రబోధాన్ని ఆచరణలో పెట్టగలిగే స్థైర్యాన్ని ప్రసాదించినందుకు నేను; అమ్మ దయవలన కొత్త జీవితంలో, క్రొత్త లోకంలో అడుగిడినందుకు బెహ[illegible] - ఇరువురం కృతజ్ఞతతో అమ్మ శ్రీ చరణాలను [illegible]న్నీటితో అభి[illegible]కించాము. విశ్వజనని అమ్మ ఒకేసారి మా ఇరువురిని తన హృదయానికి హత్తుకుని ఆనందపరవశురాలైంది.

ఆ విధంగా అమ్మ నన్ను తీర్చి దిద్దింది.





# తల్లిధర్మం

నేను తల్లి ధర్మం కోసం వచ్చాను.

అసలైన అమ్మకు ఎవరిని చూచినా బిడ్డే అనిపిస్తుంది.

బిడ్డ బురద పూసుకున్నా కడిగి దగ్గరకు తీసుకునేది తల్లి.

తల్లికి తప్పే కనిపించదు.

రావణాసురుడు దుర్మార్గుడని, లోక కంటకుడని

తల్లి ప్రేమించకుండా ఉంటుందా!

ఆ స్థానం అట్లాంటిది...

\- అమ్మ